# PAGE (PACHI) KATHALU

By Vedagiri Rambabu

తెలుగు విశ్వవిద్యాలయం పాక్షిక
ఆర్థిక సహాయంతో ఈ పుస్తకం ప్రచురించబడింది.

First edition : August, 1995.



Price : Rs. 15/-



Cover Design :
CHANDRA

Sole Distributors in Andhra Pradesh
Please Send Your Orders to:
VISALAANDHRA PUBLISHING HOUSE,
4-1-435, BANK STREET,
HYDERABAD-500 001

Distributors:
Visalandhra Publishing House,

Inside Pages Printed at :
Padmavathi Art Printers,
1-1-517/1, New Bakaram,
Gandhinagar,
Hyderabad - 500 380.
Phone : 7611413.

ప్రముఖ రచయిత,

శ్రేయోభిలాషులు

# శ్రీ రావులపాటి సీతారాంరావు గారికి

అభిమానంతో

ఈ చిరుపుస్తకాన్ని అంకితమిస్తున్నాను

—వేదగిరి రాంబాబు
27-8-95

# ఈ సంపుటిలో కథలు

# మా ఇంటిదొంగలు

ఆటో ఇంటిముందు ఆగంగానే మా ఆవిడ బ్రీఫ్ కేస్‌తో ముందు దిగి, తాళం తీయడానికి గుమ్మం వేపు కదిలింది.

నేను ఆటో దిగకుండానే పదిరూపాయల కాగితాన్ని ఆటో డ్రయివర్‌కి ఇచ్చాను. చిల్లర తీసుకుని దిగవచ్చని నా అభిప్రాయం.

"సరిపోయిందండి...." మీటర్ని తిప్పేసి, తిరిగి ఆటోని స్టార్ట్ చేస్తూ అన్నాడతను.

"ఎనిమిది రూపాయలేగా అయింది!" నా ఆశ్చర్యం అతనికి చిర్రెత్తించినట్లుంది.

"ఇక్కడికి మీటర్ చార్జ్‌కి ఎవరొస్తారండీ....ఎక్స్ట్రా ఇవ్వాలి...." ఖచ్చితంగా అన్నాడు.

"ఆ విషయం మరి నువ్వు ఎక్కకముందే ఎందుకు చెప్పలేదూ?" నాకూ కోపం వచ్చింది.

"మీరు సంగీత్ థియేటర్ దగ్గరకి అన్నారుగాని, లోపలికి అని చెప్పలేదుగా...."

"థియేటర్ దగ్గరికి అని చెప్పానుగాని థియేటర్ అని చెప్ప లేదుగా...."

"ఏమిటండీ ఈ సందులు గొందులులోకి తీసుకొచ్చి...." అతను గొంతు పెచ్చించాడు.

అప్పటికే మా ఇంటి చుట్టుపక్కలున్న ఇళ్ళ కిటికీలన్నీ తలలతో నిండిపోయి వున్నాయి. సిగ్గనిపించింది.

"ఏమండీ.... తొందరగా ఇలా రండి...." ఇంతలో మా ఆవిడ గట్టిగా కేకేసింది.

చటుక్కున కిందకి దిగాను.

అంతే! అంతకన్నా వేగంగా ఆటో అతను ఆటోని ముందుకి వురికించేశాడు, చిల్లర ఇవ్వకుండానే!

"నిన్న మనం వెళ్ళేప్పుడు మీరు తాళాన్ని సరిగా వేశారా?" నేనింకా రాకపోయేసరికి తనే మెయిన్‌గేటు దగ్గరకి వచ్చింది మా ఆవిడ.

"ఏం?" ఆమె అలా ఎందుకు అడుగుతోందో అర్థంకాలేదు నాకు.

"తలుపులకి తాళం తగిలించి వుందండీ.... వేసిలేదు...."

నెత్తిన పిడుగుపడ్డట్లు వులిక్కిపడ్డాను. ఆమె వెంటే పరుగెత్తాను.

తాళం గొళ్ళేనికి తగిలించివుంది.

నిన్న తాళం వేసిన తర్వాత నేను రెండు మూడుసార్లు గట్టిగా లాగి కూడా చూశాను. మరిదేమిటి?

చటుక్కున ఆ తాళాన్ని ఇతవలికి లాగి తలుపుల్ని తెరిచాను.

ఎదురుగా గుండెల్ని పగలగొట్టే దృశ్యం!

ఇంటినిండా సామాన్లు చిందరవందరగా పడివున్నాయి. హాల్లో వున్న టేబిల్ సొరుగులు మధ్యలో కిందపారేసి వున్నాయి. చుట్టూ పుస్తకాలూ, బట్టలూ చిందర వందరగా వున్నాయి!

ఒక్క వుదుటున బెడ్‌రూమ్‌లోకి పరుగెత్తాను. బీరువా తలుపులు కూడా బార్లా తీసున్నాయి. లోపలి లాకర్ కూడా తెరచివుంది!

అయిపోయింది! అంతా అయిపోయింది!! అక్కడే కూలబడి పోయాను. మా ఆవిడైతే ఏడుపు మొదలు పెట్టేసింది, గుండెలు పగిలిపోయి!

సెకండ్లలో చుట్టుపక్కలవాళ్ళతో మా ఇల్లు నిండిపోయింది.

అందరూ 'ఏం జరిగింది?' అంటే 'ఏం జరిగింది?' అనే ప్రశ్నల వర్షం కురిపించడం ప్రారంభించారు.

అంత బాధలో అందరికీ ఆ విషయాన్ని వివరించడం కష్టమైనా తప్పలేదు.

''అంటే - రాత్రో, తెల్లవారు ఝామునో ఈ దొంగతనం జరిగి వుంటుందన్నమాట!'' తేల్చేశారు రిటైర్డ్ టీచర్ రామనాథం.

''చుట్టూ ఇన్ని ఇళ్ళు వుండగా ఇలా దొంగతనం చెయ్యడానికి వాళ్ళకెంత ధైర్యం?!'' మరింత ఆశ్చర్యపోయారు సుబ్బారావుగారు.

''మీకు రాత్రిగాని తెల్లవారు ఝామునగాని శబ్దాలేమీ వినిపించ లేదాండీ?'' మా పక్కింటి పరమేశ్వరరావుని అడిగాను.

''అబ్బే లేదండి....'' అన్నాడు.

అదే జవాబిచ్చాడు రెండోవైపు ఇంట్లోవున్న ప్రకాశరావు కూడా.

అందరూ ఇంతవరకూ మేము గమనించలేదంటే, మేము గమనించలేదు అన్నారు.

నాకు వళ్ళు మండిపోయింది. తమ పక్కిల్లు తాళం పగలగొట్టి దొంగలు దోచుకుపోయినా వీళ్ళెవ్వరికీ తెలియలేదు! ఇది ఊరా? ఎడారా?

మరి, ఇందాక ఆటోవాడి అరుపులకి క్షణాల్లో అలా చుట్టుముట్టే వారే!

ఈ మాటల్ని బయటికి అంటే సొమ్ము పోయి కసి చుట్టుకున్నట్టవుతుంది. అందుకే ఈ బాధనంతా లోపలే దిగమింగుకున్నాను.

"అయ్యో.... బీరువాలో పెట్టిన వెండి సామానంతా పోయిందండీ!...." కంగారుగా బీరువాని వెదకబోతున్న మా ఆవిడని వారించాడు పరమేశ్వరరావు.

"అవేవీ మీరు ముట్టుకోకండి.... పోలీసులు వచ్చి వెళ్ళేంత వరకూ ముట్టుకోకుండా వుంటే మంచిది" అన్నాడు.

"అవును. వెంటనే మీరువెళ్ళి పోలీస్ రిపోర్ట్ ఇవ్వండి." ప్రకాశరావు అన్నాడు.

"మీరు మాట్లాడకుండా వూరుకున్నారంటే ఈ దొంగ వెధవలకి మరింత చులకన అయిపోతాం. రేపు మనం ఇంట్లో వుండగానే వాళ్ళు దొంగతనం చెయ్యడానికి కూడా వెనకాడరు! వెంటనే రిపోర్టివ్వండి." రంగనాథం గారన్నారు.

ఇంతకుముందు జరిగిన దొంగతనాల గురించి, వాళ్ళని పట్టుకోవడంలో పోలీసుల పాత్రల గురించి కథలు కథలుగా ఒక్కొక్కళ్ళు చెప్పడం ప్రారంభించారు.

"ఈ కథలన్నింటినీ తర్వాత వినొచ్చు, మీరు ముందు వెళ్ళి పోలీస్ రిపోర్ట్ ఇచ్చిరండి...." కన్నీళ్ళు తుడుచుకుంటూ గద్దించింది మా ఆవిడ.

పరమేశ్వరరావును తోడు తీసుకుని పోలీస్ స్టేషన్‌కి బయల్దేరాను.

మార్గాయాసం రాకుండా అతను దారిలో పోలీస్ లీలల గురించి చాల కథలు చెప్పాడు పోయిన సొమ్ముకన్నా ఎక్కువ పోయినట్లు

రిపోర్ట్‌చేస్తే కనీసం దాంట్లో సగమైనా మనం తిరిగి పొందగలమని బోధించాడు. నాకూ నిజమేననిపించింది.

పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి రిపోర్ట్ ఇచ్చాను - పరమేశ్వరరావు చెప్పినట్లే.

పోలీసులు వచ్చారు.

ఇల్లంతా బొంగరాల్లా తిరిగారు - వీటిమీద వేలిముద్రలున్నాయంటే, వీటిమీద వేలిముద్ర లున్నాయని! ఆఖరికి వేలిముద్రాలున్నాయని ఓ అద్దం, కాష్‌బాక్స్ పట్టుకెళ్ళారు ! !

ఇది జరిగిన ఓ పది రోజులకనుకుంటాను- ఇన్‌స్పెక్టర్ దగ్గరనుంచి పిలుపొస్తే వెళ్ళాను.

ఈలవేస్తూ అద్దంలో చూసి తల దువ్వుకుంటున్నవాడల్లా- అద్దంలో నా బింబం కనిపింగానే ఈలాపి చటుక్కున వెనక్కి తిరిగి "పోయిన వాటికన్నా ఎక్కువ విలువైన వస్తువులు పోయినట్లు తప్పుడు రిపోర్ట్ ఎందుకిచ్చావ్? ఇలా తప్పుడు రిపోర్టులిస్తే, ఇన్వెస్టిగేషన్ ఎలా ముందుకు సాగుతుంది? నీ వస్తువుల్ని కనుక్కోలేం. కేస్ క్లోజ్ చేస్తున్నాం" అన్నాడు కోపంగా.

కనీసం నా అద్దం, కేష్‌బాక్సన్నా వెనక్కి ఇప్పించమని అడుగుదామనుకున్నా. కానీ భయం వేసి అడగలేక వెనక్కి తిరిగాను - దొంగలు దొంగచాటుగా నా వస్తువు లెత్తుకుపోతే, వీళ్ళు దొరతనంగా కాజేశారని మనసులోనే తిట్టుకుంటూ!

ఇంటికి వచ్చిన తర్వాత అనిపించింది - నేను ఎక్కువపోయినట్లు రిపోర్ట్ ఇచ్చానని ఇన్‌స్పెక్టర్ ఎలా పసిగట్టగలిగాడు? అంటే .... ఏమి పోయాయో తెలిసిందంటే దొంగ దొరికినట్లేగా!

దొంగ దొరికినా నోరు విప్పలేని నా అసమర్థతకి నా మనసులోనే శాపనార్థాలు పెట్టుకోవడంకన్నా ఇంకేమి చేయ్యగల్ను?! *

**(ఆంధ్రభూమి సచిత్రవార పత్రిక 9-8-84)**

# ఇచ్చుట సూరిశీలు ఇవ్వబడును

ఇంట్లోంచి రోడ్డు మీదకి అడుగుపెట్టగానే నాకు తెలీకుండానే నా కళ్ళు అటు తిరిగాయి.

పంచర్ వేస్తున్న సైకిల్ ట్యూబ్‌నిశాస్త్రా కింద పారేసి చటుక్కున లేచి నిలబడి "నమస్కారం సార్! ..." అన్నాడతను.

గర్వంగా అనిపించింది.

తల వంకించి ముందుకు కదిలాను.

గత కొన్ని రోజులుగా రోజూ జరుగుతున్న తంతే ఇది! అయినా అతనలా గౌరవంగా నమస్కారం పెట్టేసరికి ప్రతిరోజూ ఒకే తియ్యని అనుభూతి! దాంట్లో మార్పు లేదు.

కానీ ఆ రోజు మాత్రం అతను ప్రతిరోజూ జరిగేదానికి భిన్నంగా గబగబా నా వేపు వచ్చాడు.

"ఏమిటి రాములూ?" అడిగాను.

"ఏంలేదు బాబూ!....మీతో కొద్దిగా మాట్లాడుదామని...."ననిగాడు.

వాడి వినయం నన్ను అడుగు ముందుకు వెయ్యనివ్వలేదు.

"చెప్పు" అక్కడే నిలబడి అడిగాను.

# 11

"మీరు నన్ను రెండు మూడు నెలలుగా చూస్తున్నారు కదా! తెల్లారే మొదలు చీకటి పడిందాకా సైకిళ్ళని రిపేర్లు చేస్తున్నా తిండికి గడవడం లేదు ... బాంక్‌లో లోను తీసుకుని కొన్ని సైకిళ్ళను అద్దెకు తిప్పుకుందామనీ...."

"ఈ దరిదాపులో ఎక్కడా అద్దెకి సైకిళ్ళ నిచ్చే షాపులు లేవు; నువ్వు పెడితే బాగానే వుంటుంది." అతని ఆలోచన నిజంగా నాకూ నచ్చింది.

"బాంక్‌లో లోనివ్వాలంటే మీలాంటి వాళ్ళ సూరిటీ కావాలట బాబూ!...." అసలు విషయాన్ని నెమ్మదిగా చెప్పాడు. ఉపోద్ఘాతమంతా దీనికోసమన్న మాట!

నా ఆలోచనలని అనుమానగా భావించినట్లున్నాడు- "మీరు దయ తలిస్తే నేను బ్రతుకుతాను బాబూ!.... ప్రతి నెలా ఇంతని కడుతూ బాకీని చెల్లగొట్టుకుంటాను...."

అతనక్కడెక్కడో అడ్డగుట్ట గుడిసెల్లో వుంటాడని విన్నాను. మా ఇంటి ముందు సైకిల్ రిపేర్ షాపు పెట్టకముందు అతన్ని చూడను కూడా చూడలేదు. ఎలా ఇతనికి సూరిటీ ఇవ్వడం?

"సందేహించకండి బాబూ!.... సైకిళ్ళని మీ కాంపౌండ్‌లోనే పెట్టి వెళ్తాను.... నాకు, నా పిల్లలకి తిండి పెట్టిన వాళ్ళవుతారు...." దాదాపు కాళ్ళు పట్టుకున్నంత పని చేశాడు.

జాలేసింది.... ఇంతగా నన్ను గౌరవిస్తూన్న, నా మీద అభిమానం చూపుతున్న మనిషిని బాధించడం భావ్యం కాదనిపించింది.

కేవలం నా సంతకం సాయంతో ఓ కుటుంబం బ్రతుకుతుంది. నా సంతకానికి అంత విలువ వుంది! గర్వంగా అనిపించింది.

"బాబూ!...." వాడు ప్రాధేయపడుతున్నాడు.

నేను డబ్బు సాయం చెయ్యనక్కరలేదుగా? ఇచ్చేది బాంకు వాళ్ళు.... పుచ్చుకునేది అతను! కానీ మధ్యలో నా సంతకానికి ఎక్కువ విలువ!!

''సరే....'' అభయమిచ్చాను.

రాములు పరమానంద భరితుడైపోయాడు. వాడికి అంత ఆనం దాన్ని కలిగించినందుకు నా మీద నాకే అభిమానం కలిగింది.

రాములుతో నేనూ బాంక్‌కి వెళ్ళడం, అక్కడ సూరిటీ బాండ్‌మీద సైన్ చెయ్యడం, వాడికి కొత్త సైకిళ్ళు రావడం ఒక వారం రోజుల్లో జరిగిపోయాయి.

మా ఇంటి ఎదురుగానే రోడ్డుకి అవతల ఖాళీ జాగాలో నాల్గు బొంగులపైన్న తడికని నిలబెట్టి దానికింద సైకిల్ షాప్‌ని ప్రారంభించాడు.

చీకటిపడింతర్వాత కొట్టు కట్టేయగానే ఆ సైకిళ్ళను తీసుకొచ్చి మా కాంపౌండ్‌లో పెట్టి తాళం వేసుకుని వెళ్ళిపోయేవాడు.

మరో నెల రోజులు కూడా తిరక్కముందే నమస్కారాలు పెట్టే వాళ్ళు నాకే కాదు మా ఆవిడకీ వున్నారని అర్థమైంది.

''మనమంటే ఆ లక్ష్మికి ఎంత గౌరవముందండి.... మనింట్లో పని చేయడానికి జేరకముందుకూడా నేనెక్కడ కనిపించినా నమస్కారం పెట్టి, ఎంతో గౌరవంగా పలకరించేది....'' మా ఆవిడ నాన్‌స్టాప్‌గా చెప్పుకుపోతోంది. నాకు విషయం అర్థంకావడంలేదు.

''అయితే ఏమిటంటావ్?'' అడిగాను.

"వాళ్ళ పాక పడిపోయిందిటండీ పాపం!.... కొత్త ఇల్లు వేసుకోవ. దానికి బాంక్‌వాళ్ళు నెలనెలా తీర్చుకునే పద్ధతి మీద తలా కొంత పాకల్లో వున్న వాళ్ళందరికీ అప్పులు ఇస్తున్నారట. మీరు సూరిటీ సైన్ చేస్తే. బావుంటుందని ప్రాధేయపడింది."

ఉలిక్కిపడ్డాను.

ఇలా నమస్కారాలు పెట్టిన వాళ్ళందరికీ సూరిటీలు ఇచ్చుకుంటూ పోతే ఇంకా ఎంతమంది కోసం బాంక్ చుట్టూ తిరగాలో?!

"మొన్ననే గదే రాములుకిచ్చింది....?"

"అతనికిస్తే ఈమె కేమిటండీ? అయినా మీరేమీ జేబుతోంచి ఇవ్వ నక్కర్లేదుగా? చిన్న సంతకం పెడితే చాలు, వాళ్ళ తిప్పలు వాళ్ళు పడతారు...."

"రెగ్యులర్‌గా ఇన్‌స్టాల్‌మెంట్స్ కట్టకపోతే తిప్పలు పడేది వాళ్ళు కాదు - మనం...."

"మీకా భయం ఏమీ అక్కర్లేదులెండి! మనం తనకిచ్చే యాభై రూపాయల్నీ తీసుకెళ్ళి ప్రతీ నెలా బాంక్‌లో కడుతుంది...."

తనలా పనిమనిషిని వెనకేసుకొచ్చేసరికి కాదనలేకపోయాను. మర్నాడే మళ్ళీ బాంక్‌కి వెళ్ళి మా పనిమనిషి లక్ష్మికి కూడా సూరిటీ ఇచ్చి వచ్చాను. నాది నాలుగంకెల జీతం కావడంతో వారం కూడా తిరక్క ముందే రెండోసారి సూరిటీ ఇవ్వడానికి వచ్చినా బాంక్‌లోవాళ్ళు కిమ్మన లేదు.

రాములు నమస్కారాలతో నేను, లక్ష్మి నమస్కారాలతో మా ఆవిడా వుబ్బి తబ్బిబ్బవుతుంటే నెలరోజులు నాలుగు క్షణాల్లా గడిచి పోయాయి.

ఆ రోజు ఆఫీసు నుంచీ వచ్చే సరికి "చూశారా - ఇదెంత పని చేసిందో?...." గుమ్మంలోనే ఎదురొచ్చింది మా ఆవిడ.

"ఎవరు? ఏమిటి?"

"జీతం ఇవ్వగానే వెళ్ళి బాంక్‌లో కట్టి రమ్మన్నాను. అలాగే అని దా చేసింది. జీతం ఇచ్చి వారం రోజులైనా బాంక్‌లో ఒక్క పైసా కూడా కట్టి రాలేదు. ఇవాళ కాస్త గట్టిగా అడిగేసరికి కోపం వచ్చి వెళ్ళిపోయింది."

"అయితే రేపటి నుంచీ పనికి రాదా?" నా గుండెల్లో రైళ్ళు పరుగెత్తాయి

"అది వస్తే మాత్రం నేను దానిచేత పని చేయించుకుంటాననుటండీ?"

"మన కళ్ళెదురుగా వుండేనే బాంక్‌లో ఇన్‌స్టాల్‌మెంట్స్ కట్టనిది మనకి కనిపించని దూరంలో వుంటే ఏమి కడుతుందే? అది కట్టక పోయిందంటే నేను కట్టుకోవాలి."

నేను భయపడ్డంతా జరిగింది. మరో మూడు నెలల తరువాత బాంకు నుంచి నాకో వుత్తరం వచ్చింది, మీరు సూరిటీ ఇచ్చిన లక్ష్మి అనే ఆవిడ అప్పు తీసుకున్న తర్వాత ఇంతవరకూ ఒక్క పైసా కూడా జమ చెయ్యలేదని, వెంటనే ఆమె కొంతయినా జమ చేసేటట్లు చూడమని! రాములు విషయంలో ఇటువంటి ఉత్తరం రాలేదు కాబట్టి అతను కడుతున్నాడన్నమాట!

వెంటనే రాముల్ని తీసుకుని లక్ష్మి గుడిసె వెదుక్కుంటూ బయల్దేరాను. అరగంట వెదికిన తర్వాత ఆమె ఉండే గుడిసె తెలిసింది. కానీ అప్పటికే ఆమె ఆ స్థలాన్ని ఖాళీచేసి వెళ్ళిపోయిందని కూడా తెలిసింది!

బాంక్‌లో తీసుకున్న అప్పుతో ఆమె ఆ గుడిసెని ఏమీ బాగు చేయించలేదు. పైగా మొన్నీమధ్యనే దాన్ని అమ్మేసిందట కూడా!

లక్ష్మిమీద కోపమంతా మా ఆవిడమీదకి మళ్ళింది. ఇంటికెళ్ళి నానా గొడవా చేశాను. సొమ్మూ పోయింది, శనీ చుట్టుకుంది అన్నట్టు డబ్బూ కట్టుకోవలసి వచ్చింది, మా ఆవిడ కోపంతో బిగుసుకుపోయింది.

మరో నెలరోజులు కూడా తిరక్కముందే మా ఆవిడకి ఆనందం, నాకు గుండెలు పగలగొట్టే సంఘటన జరిగింది.

పొద్దున లేవగానే వాకిట్లోకి వచ్చిన నాకు సైకిళ్ళు కనిపించలేదు. ఒకవేళ రాములేమైనా తీసుకెళ్ళాడేమోలే అని కాసేపు సరిపెట్టుకున్నాను. నేను ఆఫీస్‌కి వెళ్ళే టైమైనా రాములూ రాలేదు, సైకిళ్ళూ రాలేదు.

ఆఫీసుకి వెళ్ళిన తర్వాత కూడా నా మనసంతా ఏం జరిగిందోనని కొట్టుకొంటూనే వుంది.

సాయంత్రం సరాసరి రాములు వుండే ఇంటివేపు వెళ్ళాను.

అక్కడ విన్న వార్త నా గుండెల్ని పగలగొట్టింది. రాములు సైకిళ్ళని తీసుకుని రాత్రికి రాత్రే ఎటో పరారైపోయాడు.

అంటే - ఈ సొమ్ము నేనే కట్టుకోవాలన్న మాట!

జరిగినదానికి బాధ పడడం మాటటుంచి దెప్పి పొడవడం ప్రారంభించింది మా ఆవిడ. నిజమే! లక్ష్మికన్నా రాములుకి సూరిటీ ద్వారా ఇప్పించిన అప్పే ఎక్కువ!

బాంక్‌కి వెళ్ళి రిపోర్టు ఇచ్చాను.

వాళ్ళు ఒకవేళ దొరక్కపోతే సూరిటీ ఇచ్చిన ఖర్మానికి ఆ సొమ్మంతటినీ మీరే చెల్లించాలన్నారు. కాకపోతే మేనేజర్‌గారు జాలితో ఇన్‌స్టాల్‌మెంట్స్‌లో చెల్లించుకొమ్మన్నారు.

వెంటనే కోర్టులో పనిచేస్తున్న ఓ స్నేహితుడుంటే అతని దగ్గరికి పరుగెత్తాను. "పారిపోయిన వాళ్ళమీద లీగల్‌గా మనం ఎటువంటి

యాక్షనూ తీసుకోలేము. అతను బాంకుకి అప్పున్నాడు. బాంక్ అతనికి అప్పు ఇచ్చింది. మధ్యలో నువ్వు సూరిటీ ఇచ్చావు అంతే! సూరిటీ ఇచ్చిన వాడికి ఎటువంటి రైటూ లేదు. కాకపోతే అప్పు తీసుకున్నవాడు పారిపోతే వీడు కట్టితీరాలి" అన్నాడు.

ఇంకెవరి దగ్గరకూ పరుగెత్తడం అనవసరం అనిపించింది. వెంటనే ఆ సొమ్ముని కట్టేస్తే వడ్డీ భారమైనా తగ్గుతుందనిపించింది.

కనిపించిన వాడికల్లా 'నమస్కారాలు' పెట్టుకుంటూ 'అప్పు'కి బయల్దేరాను. కానీ నా నమస్కారాలకి అయిసైపోయేవాడు మాత్రం ఎక్కడా కనిపించడంలేదు. *

(ఆంధ్రభూమి సచిత్రవార పత్రిక 23-8-84)

# డబ్బుకోసమేనా మీ చింత?

డబ్బుకోసమేనా మీ చింత....?

కాదు....కాదు.... ఇంటికోసం!

ఈ జంట నగరాల్లో సొంత ఇల్లనేది వుంటే నిశ్చింతగా జీవితాన్ని గడిపేయవచ్చు అనుకునేవాళ్ళలో నేనూ ఒకడ్ని!

అందుకనే 'మా ఆఫీసులో పనిచేస్తున్నవాళ్ళకి ఇళ్ళుకట్టించి ఇస్తారు' అనగానే నేనూ ఆ హౌసింగ్‌సొసైటీలో చేరిపోయాను. బాంక్ బాలన్సంతా పూడ్చి స్థలంకోసం కట్టేను.

'అమ్మయ్య! స్థలం దొరికింది. ఇల్లు కట్టుకోడానికి లోన్ ఇస్తారు. ఇల్లు కట్టుకోవడం ఇంత తేలిక అనుకోలేదు!' ఆనందపడిపోయాను.

ఆ ఆనందంలో ఆరు నెలలు కరిగిపోయాయి.

'బెటర్‌మెంట్ చార్జెస్ కింద మరి కొంత కట్టాలి' అంటూ మా హౌసింగ్ సొసైటీవాళ్ళు పంపిన సర్క్యులర్‌ని అందుకోగానే నా ఆనందానికి అడ్డుకట్ట పడింది. అయినా ఎలాగోలా ఈ డబ్బు కాస్తా కట్టేస్తే గొడవ వదిలిపోతుంది కదాని తెలిసిన వాళ్ళందరి దగ్గరా అప్పుచేసి మరీ ఆ డబ్బు కట్టేశాను.

మరో ఆరు నెలలు గడిచాయి.

మా హౌసింగ్ సొసైటీ జనరల్‌బాడీ మీటింగ్ జరిగింది. బెటర్‌మెంట్ చార్జెస్ పెరిగాయి కాబట్టి మళ్ళీ అందరూ తలా కొన్ని వేలు కట్టాలన్నారు.

మొదటిసారి దాచుకున్న డబ్బు కట్టాం, రెండోసారి అప్పుచేసి కట్టాం. మరి ఇప్పుడెలా కట్టాలి? అందరి గుండెల్లోనూ రైళ్ళు పరుగెత్తాయి.

తప్పదు!

ఎలా?

ఇల్లనేదాన్ని ఎలాగోలా సమకూర్చుకుంటే కొన్ని సమస్యలు లేకుండా పోతాయనుకున్నాగానీ ఇలా కొత్త సమస్యలు వచ్చిపడతాయని వూహించలేదు.

ఏం చేయాలి?

ఇలా ఆలోచిస్తూ తల బద్దలుకొట్టుకుంటున్నప్పుడు వచ్చాడు శ్యామలరావు. నా బాధనంతటినీ అతని ముందు వెళ్ళగక్కుకున్నాను. అతను కరిగిపోయాడు.

"డబ్బు కోసమేనా నీ చింత? నా దగ్గర వున్నది ఓ చక్కని చిట్కా!" అన్నాడు చిద్విలాసంగా.

అంతే! అతణ్ణి శరణు వేడాను.

"మరేంలేదు. బ్రెయిన్ వేవ్ సేవింగ్స్ కంపెనీ ఏజన్సీ తీసుకో" అన్నాడు శ్రీకృష్ణపరమాత్ముని పోజులో.

"అంటే?...." నాకు అర్థం కాలేదు.

"డబ్బు అమితంగా సంపాదించడానికి ఇదో చక్కని మార్గం. ఈ బ్రెయిన్‌వేవ్ ఏజన్సీ తీసుకున్న తర్వాతే నా అప్పుల్ని వదిలించుకో గలిగాను. కిందటి సంవత్సరంలో నా టార్గెట్ బిజినెస్ చేయడంతో ఈ సంవత్సరం ఆఫీసర్నయ్యాను. ఇప్పుడు నేను కొందరు ఏజెంట్లని అపాయింట్ చేయవచ్చు" అన్నాడు ఎంప్లాయిమెంట్ ఆఫీసర్లా శ్యామల్రావ్.

ఒక్క సంవత్సరంలో అప్పులన్నింటినీ తీర్చేసుకోగలిగాడా?!

నా సందేహాన్ని గమనించి "మొదట సంవత్సరంలో అప్పులు తీర్చేసుకోవచ్చు. రెండో సంవత్సరంలో ప్లాటు కొనవచ్చు. మూడో సంవత్సరంలో వెహికిల్ కొనవచ్చు. నాల్గో సంవత్సరంలో ఇల్లు కట్టవచ్చు.... త్వరలోనే పైసా అప్పు చేయకుండా నేనో ప్లాట్‌ని, రాజ్‌దూత్‌ని కొనబోతున్నాను'' అన్నాడతను.

నా కళ్ళముందే శ్యామ్రావ్ అలా ఎదిగిపోతుంటే నేను వెర్రి వెధవలా అప్పులపాలై జుట్టు పీక్కుంటూ కూర్చోవాలా? నో....వీల్లేదు! నేనూ అతనితో సమానంగా సంపాదించాలి. కానీ నాది గవర్నమెంటు ఉద్యోగం! ఇలాంటి ఏజన్సీలు తీసుకోవచ్చా?

నా సందేహాన్ని శ్యామ్రావ్ ముందు బయటపెట్టాను.

దానికి వాడు గట్టిగా నవ్వాడు.

''ఇంత అమాయకుడివేరా. మనసుంటే మార్గమే లేదా? నీ పేరుతోనే చెయ్యాల్సిన అవసరం ఏముంది! నీ భార్య పేరుతో ఏజెన్సీ తీసుకో.... బిజినెస్సు నువ్వు చెయ్యి." చాలా సులభంగా నా అనుమానాన్ని కొట్టిపారేశాడు.

ఇంతవరకూ పెళ్ళాల పేర్లమీద కథలే రాయవచ్చు అనుకున్నా గానీ ఇలా బిజినెస్సులూ చేయవచ్చనే విషయం నాకు అప్పుడే తెలిసింది.

వెంటనే మా ఆవిడ పేరుతో శ్యామ్రావ్ దగ్గర బ్రెయిన్ వేవ్ కంపెనీ ఏజన్సీ తీసుకున్నా. హౌసింగ్‌బోర్డులో నేను కట్టాల్సినమొత్తాన్ని అతి తక్కువ వడ్డీకి అప్పుగా ఇప్పించాడు శ్యామ్రావ్.

ఇలా ప్రారంభమైన నా బిజినెస్ నా మొహమాట కారణంగా కుంటుపడిందనే చెప్పాలి. కానీ ఎప్పటికప్పుడు శ్యామ్రావ్ నన్ను హెచ్చరిస్తూనేవున్నాడు - సంవత్సరం లోపల నీ వాటా బిజినెస్‌ని చూపించాలని!

అతని పై ఆఫీసర్లు వచ్చినప్పుడల్లా నన్ను వాళ్ళ దగ్గరికి తీసుకెళ్ళేవాడు శ్యామ్రావ్. నాతోపాటు మరో నల్గురు ఏజెంట్లున్నారు శ్యామ్రావ్‌కి. మా అందరికీ బిజినెస్ ఎలా చేయాలో బోధించి తలా ఓ కప్పు కాఫీ ఇచ్చి పంపేవారు. కేవలం ఈ బిజినెస్‌వల్లే తాము వేలకి వేలు సంపాదించామని కూడా ఆశ పెట్టేవారు. ఆ ఆశ మాలో విపరీతమైన ప్రభావాన్ని చూపించేది.

చకచకా తెలిసిన వాళ్ళందర్నీ ఆ సేవింగ్స్ కంపెనీలో మెంబర్లుగా చేర్పించేసి కమీషన్ల మీద కమీషన్లు కొట్టేయాలని మనసు ఉవ్విళ్ళూరేది.

కనిపించినవాడినల్లా బ్రెయిన్‌వేవ్ సేవింగ్స్ కంపెనీలో మెంబరుగా చేర్చేయాలనే ఆతృత పెరగడంతో అందరూ కనిపించడం మానేసారు. మమ్మల్ని చూడగానే ఎక్కడివాళ్ళక్కడ పరుగెత్తేసేవారు.

అసలే పబ్లిక్ రిలేషన్స్ ఎక్కువ ఉన్నవాడ్ని నేను. అంత తేలిగ్గా వదిలిపెడతానా? ఇళ్ళకి వెళ్ళి తిష్ఠవేసి మరీ అందర్నీ పీడించసాగాను. ఈ విషయంలో శ్యామ్రావ్ అండదండలు మాత్రం నాకెప్పుడూ వున్నాయి.

మొహమాటస్థుల్ని, నిజంగా 'సేవ్' చేసుకోవాలనుకున్నవాళ్ళని - నా సర్కిల్‌లో వున్న వాళ్ళందర్నీ మెంబర్లుగా చేసినా నా టార్గెట్ పూర్తి కాలేదు. టార్గెట్ పూర్తయితేనే ప్రమోషన్! ప్రమోషన్ వస్తేనే ఆదాయం పెరిగేది!!

ఏం చెయ్యాలి?

ఇటీవల కాలంలో ఈ బ్రెయిన్ వేవ్ బిజినెస్ గురించి తప్ప మరో విషయాన్ని ఆలోచించడమే మానేసింది నా బ్రెయిన్. ఆఖరికి ఇంటి సంగతుల్ని కూడా!

ప్రమోషన్ రావాలంటే మరికొంతమంది పాలసీలు తీసుకునేట్లు చేయాలి! ఎలా?

మళ్ళీ శ్యామ్రావే నన్ను ఆపద్బాంధవుడిలా ఆదుకున్నాడు.

"పాలసీ తీసుకోవాలని వున్నా చేతిలో డబ్బు లేక వెనుకాడుతున్న వాళ్ళు ఎవరన్నా వున్నారా నీ సర్కిల్‌లో?" అడిగాడు శ్యామ్రావ్.

"నాకూ కట్టాలనే వుంది కానీ కొన్నాళ్ళు పోతేగానీ డబ్బులు చేతికందవు...." అంటూ తప్పించుకున్న వాళ్ళందరూ నా కంటి ముందు మెదిలారు.



"ఓ పదిమంది వుంటారు" అన్నాను.

"అయితే వాళ్ళందరి ఇన్‌స్టాల్‌మెంట్స్ ముందు నువ్వు కట్టేయ్. తర్వాత నెమ్మదిగా వాళ్ళదగ్గర వసూలుచేసుకోవచ్చు" తాపీగా అన్నాడు శ్యామ్రావ్.



"నీ కేమన్నా మతిపోయిందా? వాళ్ళందరి డబ్బులూ కట్టడానికి నేనేమన్నా లక్షాధికారినా? అంత లక్షాధికారినే అయితే నేనీ ఏజన్సీ ఎందుకు తీసుకుంటాను?" విపరీతమైన కోపం వచ్చింది నాకు.

"ఇలా అనుకుంటే నీ టార్గెట్‌ని నువ్వు చచ్చినా పూర్తిచెయ్యలేవు. నువ్వు చెయ్యాల్సిన బిజినెస్‌ని చెయ్యకపోతే నీకు ప్రమోషన్ రాదు. నీ ప్రమోషన్ ఆగిపోతే నా ప్రమోషనూ ఆగిపోతుంది ...." బాధగా అన్నాడు శ్యామ్రావ్.

"అదేమిటి?" అయోమయంగా అనిపించింది నాకు.

"అదంతే! ఇది ఒక పెద్ద సర్కిల్. నా ఏజంట్లు మీరందరూ ప్రమోట్ అయితేనే నాకు ప్రమోషన్ వచ్చేది. అందుకే మీ ప్రమోషన్ కోసం నేను పాటుపడాలి. తప్పదు. మీరు పాలసీ హోల్డర్లని ఎటాక్ చేస్తే,

మేము ఏజంట్లని ఎటాక్ చేయాలి. ఈ బాధలు నీకు వచ్చే సంవత్సరం అర్థమవుతాయిలే! ఇంతకీ ఆ పదిమంది సంతకాలని, వివరాలని నువ్వు తీసుకో; వాళ్ళ తాలూకు ఇన్‌స్టాల్‌మెంట్స్ ఎంత కట్టాలో అంతా నేను తెచ్చిస్తాను" అంటూ నా మాట కూడా వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు శ్యామ్రావ్.

నేను నెమ్మదిగా బయల్దేరి అందరి ఇళ్ళని చుట్టేసి, వాళ్ళందరి సంతకాలనీ అప్లికేషన్ల మీద తీసుకువచ్చేసరికి తల్రపాణం తోకకు వచ్చింది.

శ్యామ్రావ్ అన్నట్లుగానే అంత డబ్బుని తెచ్చిచ్చాడు.

చావు తప్పి కన్ను లొట్టబోయినట్లు సరిగ్గా డిపాజిట్ చెయ్యడానికి ఆఖరు రోజున కట్టాం. నాకు ప్రమోషన్ వచ్చింది; శ్యామ్రావ్‌కీ ప్రమోషన్ వచ్చింది.

కథ ఇలా సుఖాంతగా ముగిస్తే నేనసలు ఈ కథని రాయాల్సిన అవసరమే వుండేది కాదు.

అంతవరకూ ఆపద్బాంధవుడిలా కనిపించిన శ్యామ్రావ్ అపర కాబూలీవాలాలా కనిపించడం మొదలుపెట్టాడు.

రోజూ మా యింటికి రావడం, ఇవాళైనా వసూళ్ళు అయ్యాయా అని అడగడం మొదలుపెట్టాడు.

అతను మా ఇంటికి వచ్చినంత తరచుగా నేను, బలవంతంగా బ్రెయిన్‌వేవ్ మెంబర్లని చేసిన వాళ్ళ ఇంటికి వెళ్ళలేకపోయేవాడ్ని! వెళ్ళినా కూడా వాళ్ళ ఇళ్ళల్లో ఇదివరకు నాకు లభించే అతిథ్యం లభించడం మానేసింది. నన్ను చూడగానే వాళ్ళ మొహాలు ఇబ్బందికరంగా మారిపోయేవి. నాతో మామూలుగా మాట్లాడేటట్లు మాట్లాడడం కూడా తగ్గించేశారు. అయినా నాకు వాళ్ళింటికెళ్ళడం తప్పేదికాదు!

శ్యామ్రావ్ మా ఇంటికి వచ్చినప్పుడల్లా నేను వాళ్ళందరి ఇళ్ళు చుట్టూ ఓ రౌండ్ వేయడం అలవాటు చేసుకున్నాను. కానీ అతి త్వర లోనే అర్థమైపోయింది - నేను శ్యామ్రావ్ని ఒక్కడ్నే తిట్టుకుంటే, నన్ను తిట్టుకునేవాళ్ళు పదిమంది పైన వున్నారని!

శ్యామ్రావ్ రోజూ మా ఇంటికి వస్తున్నాడు. నేను నా మిత్రు లందరి ఇళ్ళచుట్టూ తిరుగుతున్నాను....

నెల రోజులు గడిచిపోయాయి.

''ఇంక ఎన్నాళ్ళకి నువ్వు వాళ్ళ దగ్గర వసూలు చేస్తావ్? నాకు ఎప్పుడిస్తావ్?'' చిరాకుపడ్డాడు శ్యామ్రావ్.

"పాలసీ తీసుకునేంతవరకూ తీసుకో తీసుకోమని ప్రాణం తీశావ్. డబ్బు లేదంటే తర్వాత ఇద్దుగాని' నేను కట్టేస్తాను అంటూ మమ్మల్ని ఇరికించి, ఇలా అప్పులవాడిలా మా చుట్టూ తిరగడం న్యాయమా?'' నిల దీశారు నేను డబ్బు కట్టిన మిత్రులు.

డబ్బు ఇవ్వలేదని శ్యామ్రావ్ చిరాకు, డబ్బు అడిగానని వాళ్ళ చిరాకు.

మరో నెల గడిచింది.

శ్యామ్రావ్ని చూడగానే గుండెల్లో రైళ్ళు గుద్దుకోవడం ప్రారం భించాయ్ నేను భయపడుతున్న రోజు రానే వచ్చింది

''నువ్వసలు నా డబ్బు ఇస్తావా- ఇవ్వవా?'' నా ఇంట్లోనే నన్ను నిలదీశాడు శ్యామ్రావ్.

ఒక్క నెలరోజులు టైమియ్యమని అతడ్ని ప్రాధేయపడ్డాను.

నెల ఇంతలో గడిచిపోయింది. నేను మాత్రం పదిమందిలో ఇద్దరి దగ్గరే కట్టిన మొత్తాన్ని వసూలు చేసుకోగలిగాను. అందరి ఆగ్రహానికీ మాత్రం గురయ్యాను.

నా బాధ నాది. శ్యామ్రావ్ మాత్రం పీటిని పట్టించుకోవడం ఎప్పుడో మానేశాడు. ఇంటిమీదపడి గొడవ చేయసాగాడు. నువ్వింత మిత్రద్రోహివని అనుకోలేదంటూ!

ఇంట్లో పరువు పోయింది.

మా ఆవిడని బ్రతిమాలి ఆవిడ గాజుల్ని తీసుకుని అమ్మేసి శ్యామ్రావ్ బాకీ తీర్చాను.

ప్రాణం కొద్దిగా కుదుటబడింది.

కానీ మర్నాటి నుంచే శ్యామ్రావ్ - నువ్వు హౌసింగ్ సొసైటీకి కట్టడానికి ఇచ్చిన డబ్బులు ఇవ్వమంటూ వత్తిడి తేవడం ప్రారంభించాడు.

మళ్ళీ వెళ్ళి మా ఆవిడని 'నీ గొలుసివ్వు నా అప్పు తీర్చుకుంటా' నంటే 'నువ్వొద్దు. నీతో సంసారం వద్దు' అంటూ పుట్టింటికి లేచి చక్కా పోతుందేమోనని భయంతో మా ఆవిడ ముందు బయటపడలేదు.

సరిగ్గా ఇదే సమయంలో హౌసింగ్ సొసైటీ రెండో ఇన్స్టాల్మెంట్ కట్టడానికి ఎవరిదగ్గర అప్పులు చేశానో వాళ్ళందరూ 'మా డబ్బు....! మా డబ్బు... !' అంటూ వెంటపడడం ప్రారంభించారు.

చుట్టూ అప్పుల బాధ....

ఏం చెయ్యాలి?

బుర్ర బద్దలు కొట్టుకుంటున్నప్పుడు మా హౌసింగ్ సొసైటీనుంచి వాళ్ళో సర్క్యులర్ వచ్చింది. మరో రెండువేలు కడితే స్థలం మీ పేర రిజిష్టర్ చేస్తామని!

ఒక్కసారి మెదడంతా శూన్యమైపోయింది. ఆ శూన్యంలోంచే ఓ చక్కటి ఫ్లాష్ వచ్చింది.

వెంటనే హౌసింగ్ సొసైటీ ఆఫీసుకి వెళ్ళాను. 'నాకు ఇల్లు వద్దు, మెంబర్‌షిప్పూ వద్దు. నా డబ్బు నా కిచ్చేయండి మొర్రో!' అని అప్లికేషన్ పెట్టుకున్నాను.

ఆ డబ్బు రాగానే ముందు శ్యామ్రావ్ అప్పు తీర్చాను. తర్వాతే మిగతావాళ్ళగురించి ఆలోచించాను.

విచిత్రమేమిటంటే- ముందు వాళ్ళకి చెప్పిన దానికన్నా ఎక్కువ కాలాన్ని తీసుకున్నానని అందరూ 'వడ్డీ' డిమాండ్ చేశారు. దాంతో హౌసింగ్ సొసైటీ నుంచి వెనక్కి తీసుకున్న ఆ డబ్బు అయిపోయినా అప్పు పూర్తిగా తీరలేదు. వాళ్ళతో విరోధం.... అలాగే పాలసీలు తీసుకొమ్మని బలవంతం చేస్తూ ఎవరికెవరికైతే డబ్బు కట్టానో వాళ్ళందరూ నేనెక్కడ ఆ డబ్బు అడుగుతానో అని తప్పించుకు తిరగసాగారు. మిగతా వాళ్ళలో నేనెక్కడ పాలసీ తీసుకొమ్మంటానో అని కొందరు, 'అప్పు' అడుగుతానేమోనని మరికొందరు....ఇలా అందరూ నన్ను చూసి పారిపోతుంటే - ఇంత గొప్పవాడ్ని ఎందుకయ్యాను? హౌసింగ్ సొసైటీలో మెంబరుగా జేరడంవల్లనా? లేక బ్రెయిన్‌వేవ్ ఏజంటు కావడం వల్లనా? బుర్ర బద్దలు కొట్టుకుంటూ బాధపడడం నావంతైంది! *

(ఆంధ్రభూమి సచిత్రవారపత్రిక 13.9.84)

# కేవలం కాగితాలకే పరిమితమైనవి...

అను

# ఓ ఆదర్శం కథ!

కాలేజీలో చదువుకునే రోజుల్లో ఎన్నోసార్లు వ్యాస రచన పోటీల్లో బహుమతులు పొందాను!

మరెన్నోసార్లు డిబేట్లలో వాదించి అందరి ప్రశంసలూ పొందాను!!

ఇంకా చెప్పాలంటే—

సీనియర్స్ దృష్టిలో ఆదర్శ విద్యార్థిని ... సమకాలీనుల దృష్టిలో ఉన్నతురాలు.... జూనియర్స్ దృష్టిలో హీరోని....!!!

ఇన్ని రకాలుగా నేను అభినందించబడటాని కారణం....?

నా ఆదర్శాలు, ఆశయాలు!

అందుకే కాలేజీని వదిలిపెట్టినా వాటిని వదిలిపెట్టదలచుకోలేదు.

మనుషులు డబ్బుని సంపాదించాలి. కాని డబ్బు మనుషుల్ని సంపాదించకూడదు.... అన్నిటికన్నా ముఖ్యమైనది మానవత్వం.... ప్రేమతో దేనినయినా సాధించవచ్చు.... ఇవి కేవలం కొన్ని అభిప్రాయాలు మాత్రమే!

అందుకే నేను ఉద్యోగస్థుణ్ణి అయిన తర్వాత డబ్బుకి అసలు విలువ ఇవ్వడమే మానేశాను. మిత్రులు, చుట్టాలు ఎవరితో తిరిగినా, వాళ్ళు పైసా ఖర్చుపెట్టినా నాకు ఇష్టం వుండేదికాదు. ఖర్చంతా నాదే! వాళ్ళు అభిమానాన్ని చూపిస్తేచాలు!

అందరికీ నేనంటే విపరీతమైన ప్రేమ!

ఇలా నా అభిప్రాయాలతో అందల మెక్కినట్లు మురిసిపోతున్న నాకు కన్య ఓ పెళ్ళిలో కనిపించింది.

నా ఆశయాలకు, ఆదర్శాలకు తగ్గ మనిషిగా అనిపించింది.

అంతే! ఏ మాత్రం సందేహించకుండా ఆమె ముందు విషయాన్ని వుంచేశాను.... మీకిష్టమైతే మిమ్మల్ని పెళ్ళి చేసుకోవడానికి మీవాళ్ళని సంప్రదిస్తానని!

కన్య కళ్ళు ఆనందంతో మెరిశాయి.

అందం, మంచి ఉద్యోగం వున్న యువకుడు వచ్చి ఏరి, కోరి 'నిన్ను పెళ్ళిచేసుకుంటాను' అంటే ఏ ఆడపిల్ల కళ్ళు మెరవవూ?

"ఆదివారం సాయంత్రం మీ ఇంటికి వస్తాను." అప్పటి కప్పుడే అపాయింట్‌మెంట్ ఇచ్చేశాను.

కన్య మరింత ఆనందపడింది.

ఆదివారం కోసం ఆమె ఎదురు చూసిందో లేదో గాని నేను మాత్రం తెగ ఎదురు చూసాను. ఆదివారం సాయంత్రం సరిగ్గా నాలుగ్గంటలకల్లా వాళ్ళ ఇంటిముందు వాలాను.

గుమ్మంలోనే ఎదురొచ్చింది కన్య.

వాళ్ళ నాన్నగారికి పరిచయం చేసింది.

ఆయన నన్ను చాలా ఆప్యాయంగా పలకరించారు. "పైన కూర్చుని మాట్లాడుకుందాం పదబాబూ!...." దాదా పైకి దారితీశారు ఆయన. అనుసరించాను నేను.

కన్య అంతా ఆయనకి చెప్పేసినట్లే అనిపించింది. అందుకే ఎక్కువ ఉపోద్ఘాతం లేకుండా అసలు విషయంలోకి వచ్చేశాను.

''చాలా సంతోషం బాబూ!.... నీలాంటి యువకుల అవసరం దేశానికి ఎంతో వుంది... సినిమాలు, షికార్లు అంటూ తిప్పకుండా ఇలా సూటిగా నాతో మాట్లాడడానికి రావడమే నీ వ్యక్తిత్వం చెబుతుంది...." ఆయన కాంప్లిమెంట్ నిజంగా నన్ను అందలాన్ని ఎక్కించేసింది.

నోట మాట రావడం మానేసింది.

అందుకే ఆయనే మాట్లాడసాగారు:

"డబ్బుకి అమ్ముడు పోయే కుర్రాళ్ళంటే నాకు వళ్ళు మంట. అందుకే నాకు ఎంత డబ్బున్నా కట్నంతోమాత్రం అల్లుణ్ణి కొనగూడదనే ఆదర్శానికి కట్టుబడ్డవాణ్ణి...."

నా కాలికి బ్రేక్ వేశాడాయన. అయినా నేను కిందపడలేదు. కారణం నేనూ ఆదర్శాలు గలవాణ్ణి కావడమే!

"అవునండీ .... నాకూ ఈ కట్నాలమీద సదభిప్రాయం లేదు...." ననిగాను.

"ఆ విషయం నువ్విలా డైరెక్ట్‌గా రావడంతోనే అర్థమవుతోం బాబూ! .... కొంతమంది కట్నాలు వద్దంటూనే లాంఛనాలు లిచదువుదిస్టారు ..."

"వాటికీ నేను విరుద్ధమండీ! ..."

"మా అమ్మాయి చాలా అదృష్టవంతురాలు బాబూ!...."

ఆనందపడిపోయాను.

"ఆడంబరంగా పెళ్ళిఖర్చులు చెయ్యడం దండగ కదూ?...."

నా నోటికి తాళం పడింది.

ఏమి మాట్లాడితే ఆయన కాళ్ళకి బంధం ఎలా వేస్తారో అనే భయంతో వూరుకుండిపోయాను. 'ఎలాంటివారు, ఎలా మారిపోయారు' అని కన్య ఎక్కడ ఛీత్కరించుకుంటుందోననే భయమూ నాలో లేకపోలేదు.

"పెళ్ళి పూట మాత్రం భోజనాలు ఏర్పాటు చేస్తాను .... వెంటనే మనం ఆ హాల్‌ని ఖాళీ చేస్తే అద్దె తగ్గుతుందికదా?"

ఆలోచనలో పడ్డాను.

ఇంట్లో అమ్మ, నాన్నగార్లను ఏదోవిధంగా కన్విన్స్ చేసి కట్నం లేకుండా చేయగలను. బెల్లెళ్ళని బ్రతిమాలి లాంఛనాలు నేను ఇస్తానని సర్దిచెప్పగలను. కానీ పెళ్ళి చూడాలని ఎంతో దూరం నుంచీ వచ్చే బంధువుల్ని, మిత్రుల్ని వెంటనే తిరిగి వెళ్ళిపొమ్మని ఎలా చెప్పగలను?

అదే సందేహాన్ని ఆయన ముందు వెళ్ళగక్కాను.

"చూడు బాబూ! మందికోసం ప్రాకులాడడం నాకు ఇష్టం వుండదు. నా పద్ధతులు నావి...."

ఇంతవరకూ ఎంతో ఆదర్శవంతుడినని నన్ను ఒక్కో మెట్టూ పైకి ఎక్కిస్తున్న ఈయనేనా ఇలా మాట్లాడుతున్నది?

ఆయనంత నిర్మొహమాటంగా మాట్లాడేసరికి నాకూ కోపం వచ్చింది ఓ దణ్ణం పెట్టి లేచి వద్దామనిపించింది.

కానీ, అలా చేస్తే కన్య నన్ను ఎంత నీచంగా అనుకుంటుంది? ఈ ఆలోచన నన్ను తొందరపడనివ్వలేదు.

ఒక ఆదర్శప్రాయుడుగానే నిలబడాలన్న నా ఆశ ఏమైపోతుంది?

అందుకే ఆయన చెప్పినవాటిన్ని అన్నింటికీ వప్పేసుకుని 'మంచి వాడు' అనే బిరుదుని తీసుకుని మరీ ఇంటికి బయల్దేరాను.

ఈ విషయాలన్నింటినీ చెప్పేసరికి ఇంట్లో బాంబులు పేలినట్లు యింది అందరూ నన్ను 'విదేశీహస్తాన్ని' చూసినట్లు చూడసాగారు. ఎలాంటివాడు ఎలా మారిపోయాడు అనుకున్నారు అంతా ముక్తకంఠంతో. "ఆల్‌రైట్! సరే.... నీ ఆదర్శాల కోసంనేను పైసా కట్నం తీసుకోను సరే.... కానీ మీ చెల్లెలికి కూడా పైసా కట్నం ఇవ్వకుండా పెళ్ళి చేస్తావా?" సూటిగా అడిగారు నాన్నగారు.

"ఆ" అన్నాను.

"దేశం నీలాంటి చవటలతో నిండిలేదురా!" ఆయన కోపం పెరిగింది.

"ఒకవేళ కట్నం ఇవ్వాల్సివచ్చినా ఆ సంగతి నేను చూసుకుంటాను...."

"నా పిల్ల పెళ్ళి నేను చేసుకోలేనివాణ్ణనుకున్నావా! నీకా శ్రమ అక్కర్లేదులే. నువ్వు మాత్రం ఒకటి గుర్తుంచుకో. నన్ను కాదని ఈ పెళ్ళికి వప్పుకుంటున్నావు కాబట్టి ఇకముందు నా అండ నీకుండదు. అది మాత్రం గుర్తుంచుకో...."

ఇలా నా ఆదర్శోపాఖ్యానం మొదటి అధ్యాయం ముగిసింది.

"చూడు అల్లుడూ! పెళ్ళి అయిపోయింది. ఇప్పుడు కన్య నా కూతురు కాదు. నీ భార్య" అన్న మా మామగారి మాటల్లోని అసలు విషయం అప్పుడు నాకు అర్థం కాలేదు.

"నీ అంతట నువ్వు వచ్చి కోరితేనే నా పిల్లని నీ కిచ్చాను. ఇక నా బాధ్యతేమీలేదు. మళ్ళీ మాట్లాడితే ఆమెనే అభిమానించే నా బాధ్యత కూడా నీదే!" అన్న అర్థం ఆ మాటలదని తర్వాత అర్థమైంది.

కోరి రావడంతో మామగారికి అలుసయ్యాననే విషయం చాలా ఆలస్యంగా తెలుసుకున్నాను. అప్పుడు తెలుసుకునీ లాభంలేదు.

"నాకు ఇంకా ఆడపిల్లలున్నారు. కాబట్టి ఇంతవరకూ నీకు చేసిందే గొప్ప...." కన్యాని నా చేతిలో పెట్టి నా కాళ్ళు కడగడానికి బదులు తన చేతులు కడిగేసుకున్నాడు ఆ పెద్దమనిషి. ఏదో మాట్లాడబోతే 'పెళ్ళి కాగానే ఎలాంటివాడివి ఎలా మారిపోయావు?!' నిష్ఠురాలాడి తప్పించుకున్నాడాయన.

ఇంట్లో వాళ్ళకి ఈ విషయాలు తెలిస్తే మరింత చులకనైపోనూ? నువ్వేగా ఏరికోరి ఆ సంబంధాన్ని చేసుకున్నది? అని నిలదియ్యరూ?

అందుకే అంతా దిగమింగుకోవడం తప్పనిసరైంది.

ఎటూ సపోర్ట్ లేకపోవడంతో ఇబ్బందులు మొదలయ్యాయి.

పురుళ్ళు.... పేరంటాలు....!

ఇదివరకటిలా డబ్బు చేతిలో ఆడడం లేదు. దాంతో స్నేహితులకు, బంధువులకు నాలో మార్పు కనిపించసాగింది.

మరింత ఆర్థిక ఇబ్బందుల్లోకి దిగజారడంతో అడపాదడపా ఎవర్నో ఒకర్ని డబ్బుకోసం ఆశ్రయించాల్సిన పరిస్థితులూ ప్రారంభమయ్యాయి.

అంతే! వాళ్ళందరూ మరింత దూరమవసాగారు.

"ఎలాంటివాడు ఎలా మారిపోయాడు?!" ముక్కున వేలేసుకున్నారు.

* * *

ఆదర్శాల పళ్ళచక్రంలో రోజులు భారంగా దొర్లుతున్నాయి. రోజురోజుకీ ఒంటరితనం పెరిగిపోతోంది.

నాగురించే ఆలోచిస్తూన్నాగానీ తన గురించి ఆలోచించడంలేదనే విషయం అఖండ రూపంతో నాముందు దొర్లించింది హఠాత్తుగా మా ఆవిడ.

తెలుగు సినిమాలు తెగచూడడం, కలలు కనడం ఆమె హాబీ అని పెళ్ళయిన తర్వాతే తెలుసుకున్నాను.

నా కళ్ళు బైర్లు కమ్మాయి.

తన గురించి ఆలోచించడం లేదా? అసలు నేని పరిస్థితులన్నీ ఎవరికోసం ఎదుర్కొంటున్నట్లు?

పరిస్థితినంతా ఆమెకు వివరించాలనుకున్నాను.

''పెళ్ళికి ముందేవీటన్నింటి గురించీ ఆలోచించాల్సింది. మీ అంతటికి మీరే నా వెంటపడ్డారు. తీరా ఇప్పుడు....'' ఆమె గొంతు బొంగురు పోయింది.

"ఎలాంటి వారు ఎలా మారిపోయారూ!?" తనే అనేసింది.

నెత్తిన కర్రతో మోదినట్లయింది.

కళ్ళు గిర్రున తిరిగాయి. అయినా తమాయించుకున్నాను.

నేను ఏ మాత్రం మారలేదు. ఆ విషయం నాకు తెల్సు. నా ఆదర్శాలని నేను విడిచిపెట్టదలచుకోలేదు. పెట్టను కూడా!

అందుకే ఇప్పుడు నేను చాలామంది దృష్టిలో అసమర్థుడిని!

ఇంకొంతమంది దృష్టిలో బ్రతకడం చాతకానివాడిని!!

అవునుమరి, ఇప్పుడు నేనుంటున్నది కాలేజీ గోడలమధ్యకాదు. విశాల ప్రపంచంలో!!!

*

(ఆంధ్రభూమి సచిత్రవారపత్రిక 18-10-84)

# శాంతి! నువ్వెక్కడ?

శాంతిట....శాంతి!

ఆమెను చేసుకుంటే నాకు దొరికేది శాంతి కాదు — అశాంతి!

భార్య అందంగా వుండాలనుకోవడం ఆశ కావచ్చు. కానీ కనీసం అసహ్యం పుట్టేటట్లు వుండకుండా వుండాలనుకోవడం దురాశ కాదుకదా?!

శాంతి తండ్రి లక్షాధికారే కావచ్చు. ఆమె అతనికి ఏకైక పుత్రికే కావచ్చు. ఒక్కసారి ఆమె మొహం వంక చూస్తే చాలు-భయంతో, అసహ్యంతో వళ్ళు గగుర్పొడుస్తుంది. అటువంటి ఆమెతో సంసారం చెయ్యడం ఎలా?

అందుకే అందరూ నచ్చచెప్పాలని ప్రయత్నించినా ఆమెను చేసుకోనని ఖచ్చితంగా చెప్పేశాను.

నా శ్రేయోభిలాషులందరికీ కోపం వచ్చింది. 'సిరిరా మోకాలు అడ్డడం' అంటే ఇదే! అని నా విపరీతభావాలకి జాలిపడ్డారు. నేను మాత్రం గర్వపడ్డాను.

ఆఫీసుకి వచ్చినా ఇంకా నన్ను ఆ ఆలోచనలు విడిచిపెట్టలేదు.

నేనే పెందలాడే వచ్చాననుకున్నాను. కానీ అప్పటికే ప్రసాద్ వచ్చేసి వున్నాడు.

అతను నాకన్నా ఎక్కువగా ఆలోచిస్తూ కనిపించాడు. అతని బాధ ఏమిటో పాపం?

ఆలోచిస్తున్నవాడల్లా హఠాత్తుగా "డామిట్...." అంటూ ఎదురుగా వున్న బల్లమీద గట్టిగా గుద్దాడు.

ఉలిక్కిపడి వూరుకోలేకపోయాను.

నెమ్మదిగా అతని సీటు దగ్గరకు వెళ్ళి పక్కనున్న కుర్చీలో కూలబడ్డాను. ఆఫీస్ టైమ్ ఇంకా వుండడంతో మరెవ్వరూ రాలేదు.

నా వునికి కూడా ప్రసాద్ గమనించడం లేదు. పళ్ళు కొరుకుతున్నాడు. గుర్రుమంటున్నాడు. మధ్య మధ్య బల్ల గుద్దుతున్నాడు. గుడ్ల నీరు కుక్కుకుంటున్నాడు.

''ఏమిట్రా? ఏమైంది?'' అడిగాను.

''అది....అది....'' పళ్ళు పటపటా కొరికాడు. నావంక గుర్రుమి చూశాడు.

నాకు భయం వేసింది.

''ఏది?'' బిక్కు బిక్కుమంటూ అడిగాను.

''అదే..మా ఆవిడ..! ఛా....ఛా ...దాన్ని ఆవిడ అనగూడదు....''.

''మరేం అనాలి?'' నాకు తెలీకుండా అనేశాను.

''నీతి జాతిలేని మనిషనాలి. ఎంత ఉద్యోగస్థురాలైతే మాత్రం.... వాడితో అలా విచ్చలవిడిగా తిరుగుతుందా?'' చటుక్కున కర్చీఫునుందుకుని కళ్ళద్దుకున్నాడు.

నాకు అంతా అయోమయంగా వుంది.

ఇద్దరం కలిసి కాంటీన్‌కి వెళ్ళాం.

వాడక్కడ కోపంతో, బాధతో, నవరసాలతో చెప్పినదాన్నిబట్టి విషయం నాకు అర్థమైంది.

వాడి భార్య మరెవరితోనో చనువుగా తిరుగుతోంది. ప్రసాద్‌నే కాదు- ఏ మగాడి మనసునయినా నలిపివేసే అనుభవం అది!

కాఫీ ఇప్పించి, ఓదార్చి వెనక్కి తీసుకొచ్చాను.

అప్పటికే చాలామంది వచ్చేశారు.

కానీ ఎవ్వరూ సీట్లలో లేరు.

అందరూ పరంధామయ్యగారి సీటు చుట్టూ మూగేసివున్నారు. పరిస్థితి అర్థంగాని మేమూ అటు వెళ్ళాం.

"అంతగా బాధపడకండి పరంధామయ్యగారూ!....అందుకే అన్నారు అద్దాలనాడు బిడ్డలుగాని గడ్డాలనాడు కాదని ...." ఓదారుస్తున్నాడు పరమేశ్వరరావు.

''కొడుకైతే పర్లేదు- కూతురు అలా చేసింది. అదీ ఆయన బాధ."

''ఏమిటి మీరనేది? కొడుకు చేస్తే అది తప్పుకాదు—కూతురుచేస్తే తప్పు అవుతుందా? తప్పు అనుకుంటే అది ఎవరు చేసినా తప్పే!'' ఆవేశంగా నిరంజనాన్ని ఖండించింది జానకి.

''ముందు మీరు వాదించుకోవడం కాదయ్యా, ఆ ముసలాయన్ని ఓదార్చండి.'' హెడ్‌క్లర్క్‌గారు కోప్పడ్డారు.

''ఏం జరిగింది?'' నిరంజనాన్ని అడిగాను.

''పాపం, పరంధామయ్యగారి అమ్మాయి ఎవరితోనో లేచిపోయిందట!....''

'ఈ ముండాకొడుకు పిల్లల పెళ్ళి గురించి ఆలోచించడం లేదు. వాళ్ళెవరితోనో లేచిపోతారు చూడు!' అంతకుముందు ఎన్నోసార్లు పరంధామయ్యగారిని కామెంట్ చేసిన నిరంజనమే ఎంతో బాధతో చెప్పాడు.

బాధనిపించింది.

అందరం తలా ఒకరకంగా ఆయన్ని ఓదార్చి వచ్చి ఆఫీసు-పనిలో పడ్డాం.

పెళ్ళి చూపులకోసం ఈ మధ్య ఎక్కువగా శెలవులు పెడుతుం-డడంతో నా సీట్లో పని బాగా పేరుకుపోయింది.

ఫైళ్ళలో మునిగిపోయిన నాకు టైమ్ తెలియలేదు.

''ఏంటి రాజారావ్‌గారూ! తెగ కష్టపడి పోతున్నారు....'' జానకి పలకరింపుతో వులిక్కిపడి ఈ లోకంలోకి వచ్చాను.

ఫైళ్ళని పక్కకి నెట్టి ''కూర్చోండి'' అని, ఎదురుగా వున్న కుర్చీని చూపిస్తూ చిన్నగా నవ్వాను.

''మీ పెళ్ళి చూపులు ఎంతవరకూ వచ్చాయ్?'' చిన్నగా నవ్వింది.

ఆమె వయసులో నాకన్నా చాలా పెద్దది. అందుకనే అలాంటి చచ్చు జోకుల్ని ఎన్నింటిని వేసినా నవ్వడంతప్ప మరేమీ తిరిగి అనలేని బలహీనత నాలో చోటు చేసుకుంది.

''అవునూ బ్రహ్మచారులు.. మీకు ఖర్చులేమివుంటాయి? నాకో రెండువేలు అప్పు పెట్టగూడదూ?''

''మీకు నేను అప్పు పెట్టడం ఏమిటండీ?'' మళ్ళీ బలవంతంగా నవ్వాను.

''మొన్నిమధ్య మా ఇల్లు రిపేరు చేయించాను కదా? ఉన్న డబ్బంతా హుష్‌కాకి అయిపోయింది. మా మేనకోడలికి అర్జంటుగా డబ్బుకావల్సి నా దగ్గరికి వచ్చింది. అందుకని రెండువేలు ఇచ్చావంటే. మరో మూడునాల్గు నెలల్లో తిప్పి ఇచ్చేస్తాను'' అంది జానకి.

ఆవిడ మాటల్లోనూ నిజం లేకపోలేదు. బ్రహ్మచారిని కావడంతో నాకు మిగతావాళ్ళకిలా ఖర్చులు లేవు. అందుకనే ప్రతి నెలా జీతంలో అధికభాగం బాంక్‌లో వేస్తుంటాను.

ఇంతకుముందు రెండు మూడుసార్లు ఆవిడ ఇలాగే అడిగి తీసుకు వెళ్ళింది. చెప్పిన టైమ్‌కి ఒక నెల అటూ ఇటూగా తిరిగి ఇచ్చేసింది.

అందుకే మరోమాట మాటాడకుండా లంచ్‌లో బాంకుకి వెళ్ళి ఆమెకు రెండువేలు తెచ్చిచ్చాను.

ఎక్కడ చూసినా అశాంతి!

మరో రెండు నెలలు గడిచిపోయాయి.

ఈ రెండు నెలల్లోనూ మరో పదిమంది ఆడపిల్లల్ని చూశాను. కానీ ఎవ్వరూ నాకు నచ్చలేదు.

ఆ రోజు ఆఫీస్‌కి వస్తూ నేను చూసిన సంఘటన నాకు పెద్ద షాక్‌నిచ్చింది.

ప్రసాద్ మోటారు సైకిల్‌మీద ఆఫీసుకు వచ్చాడు. అలా అతను రాగూడదని కాదు.

అంతకుముందు తన భార్య ఎవరితో తిరుగుతోందని ఆ ప్రమిత్రుడైన నాకు చెప్పుకుని తెగ బాధపడ్డాడో ఆ మనిషే మోటార్ సైకిల్ మీద ఎక్కించుకుని తీసుకొచ్చి దింపిపోయాడు ప్రసాద్‌ని! ఆ మోటార్ సైకిల్‌మీదే తన భార్యని తిప్పుతున్నాడని ప్రసాద్ తెగబాధపడ్డాడు!

నన్ను చూడగానే వాడూ షాక్‌తిన్నాడు. కానీ వెంటనే తేరుకుని ''ఈమధ్య వాసుదేవరావు మా ఫామిలీకి మరీ దగ్గరై పోయాడోయ్! వద్దని వారిస్తున్నా పాపం, రోజూ నన్ను ఆఫీసుదాకా తీసుకొచ్చి దింపి పోతున్నాడు'' అంటూ ఓ వెకిలి నవ్వునవ్వాడు.

నాకు చాలా చిరాకేసింది.

వాడిభార్య ఎవరితోనో తిరుగుతోందని, అతను బంగారు పిచ్చుకి కావడంతో వాడు విదిలించే ఎంగిలి మెతుకులకి ఆశపడి ప్రసాద్ కిమ్మన కుండా పడుంటున్నాడని ఆఫీసులో కొంతమంది గుసగుసలాడుకుంటూం టే విన్నాను. ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నాను.

అందుకే ఆ విషయంమీద అతనితో ఎక్కువగా మాట్లాడాలని పించలేదు.

సీట్లోకివచ్చి కూర్చోగానే జానకి తనివ్వాల్సిన డబ్బు తెచ్చిచ్చింది.

ఆ డబ్బుని చూడగానే మనసులోని చిరాకు మరింతైంది.

ఈ వెధవ డబ్బుకోసమేగా ప్రసాద్‌లాంటి వాళ్ళంతా ఆత్మాభి మానాన్ని చంపుకుని తిరుగుతున్నది?

ఆ రెండువేలని టేబుల్ సొరుగులో పారేసి నా పనిలో నిమగ్నమై పోయాను.

లంచ్‌లో ఆ డబ్బుని బాంక్‌లో పడేద్దామని వెళ్తుంటే పరంధా మయ్యగారు ఎదురొచ్చారు.

"ఏమండీ! పండక్కి కొత్త అల్లుణ్ణి, కూతుర్ని పిలిచారా?" గబుక్కున అడిగేశాను. ఆ తర్వాత అలా ఎందుకు అడిగానా అని బాధపడ్డాను.

కానీ పరంధామయ్యగారు మాత్రం ఏ మాత్రం బాధపడలేదు. పైగా గర్వంగా "కులం తక్కువైనా మా అల్లుడిది గుణం పెద్దది. ఈ పండక్కి నేను పిలవకపోయినా వాళ్ళిద్దరూ వచ్చారు. మా ఆవిడకి, నాకు బట్టలు తెచ్చారు. ఆ అబ్బాయి ఎంత మర్యాదస్తుడని!... " మురిసి పోసాగారు అల్లుణ్ణి తలచుకుని మరీ పరంధామయ్యగారు.

ఇంతకుముందు ఈయనేనా ఆఫీసులో అందరిముందూ అల్లుణ్ణి కూతుర్ని తక్కువచేసి మాట్లాడి సానుభూతి పొందడానికి కన్నీళ్ళు కూడా పెట్టుకుంది? అనుమానం వేసింది.

"మంచిదండీ.... బాంక్ దాకా వెళ్ళివస్తాను." గబగబా ఇవతలికి వచ్చేశాను.

బాంక్ లో డబ్బువేసి వస్తుంటే ప్రకాశం ఎదురొచ్చాడు.

''ఇప్పుడు ఏం వచ్చినాయ్? ఎ[్రియర్సా?'' నవ్వుతూ పలకరించాడు ప్రకాశం.

"కాదు, జానకిగారికి రెండు వేలిచ్చాను. ఆవిడ ఆ డబ్బులిస్తేను...."

"సరిపోయింది. ఆవిడకి డబ్బులు పెట్టుబడి పెడుతోంది నువ్వా?!" ఆశ్చర్యంగా అడిగాడు ప్రకాశం.

''పెట్టుబడి ఏమిటి?'' వాడి మాటలు అర్థంకాలేదు నాకు.

''ఆవిడ వడ్డీ వ్యాపారం చేస్తుంది. మీ ఆఫీసులోనివాళ్ళతో కాదు, ఇంటి చుట్టుపక్కలవాళ్ళతో....''

ఉలిక్కిపడ్డాను.

''వాళ్ళ మేనకోడలికి ఏదో అర్జంటుగా డబ్బు అవసరమైందని అడిగితే ఇచ్చాను.''

''రైటే.... అవసరమయ్యే వుంటుంది. ఈవిడ డబ్బొ సర్ది వుంటుంటి.... కాకపోతే వాళ్ళదగ్గర వడ్డీ వసూలుచేసి. దాన్ని మాత్రం తను మింగి వుంటుంది.... నువ్వేమో పాపం, బాంక్ లో నీకువచ్చే వడ్డీని కూడా వదులుకుని ఆవిడ వడ్డీలకి తిప్పుకోడానికి ఊరికే ఇస్తున్నావన్న మాట!'' ఇంతలో వాడి టోకన్ నెంబర్ని కాషియర్ పిలవడంతో అటు వెళ్ళాడు ప్రకాశం.

ప్రసాద్.... పరంధామయ్యగారు.... జానకి.... వరసగా నా మదిలో మెదిలారు.

డబ్బు....డబ్బు... డబ్బు....

ప్రపంచంలో అందరూ ఆరాధించేది ఆ డబ్బు!

ఆ డబ్బుని కాదని అందం కోసం ప్రాకులాడుతున్న నేనెంత మూర్ఖుణ్ణి?

సీట్లోకి వచ్చికూర్చున్న తర్వాత కూడా రకరకాల ఆలోచనలు నా మనసుని ముసురుతూనే వున్నాయి.

అతికష్టంతో అయిదు గంటల వరకూ ఏ పనీ చేయకుండా రకరకాల ఆలోచనలతో గడిపాను.

ఇదివరకటి అశాంతి ఇక్కడ పూర్తిగా తొలగిపోయింది. అందుకా కారణం? డబ్బు....!

సరిగ్గా అయిదు గంటలకి ఓ నిర్ణయాని కొచ్చాను. "శాంతీ! నువ్వెక్కడ? డబ్బులోనా?" నవ్వొచ్చింది.

సరాసరి శాంతి సంబంధాన్ని తెచ్చిన సుబ్బారావు ఇంటికి వెళ్ళాను.

"శాంతిని చేసుకోవడం నా కిష్టమే!" నెమ్మదిగా అతన్తో అన్నాను.

ఫక్కున నవ్వాడు సుబ్బారావు.

"శాంతిని నువ్వు పెళ్ళిచేసుకోవడమేమిటి? ఆవిడ పెళ్ళి ఎప్పుడో అయిపోయింది !" పడీ పడీ నవ్వసాగాడు సుబ్బారావు.

అంత అందవికారమైన శాంతి పెళ్ళి అంత త్వరగా జరిగిపో యిందా?! ఆశ్చర్యమేసింది.

ఆ విషయాన్నే సుబ్బారావుతో అన్నాను.

"అంత బంగారు పిచ్చుకని నువ్వు కాబట్టి వద్దన్నావుగాని నా ఎగిరి గంతేస్తారని అప్పుడే చెప్పాగా? నువ్వు కాదన్నావని ...నికి వెళ్ళినప్పుడే మరో సంబంధాన్ని తీసుకెళ్ళాను. అతను ఎగిరి ...సి మరీ ఆమెను పెళ్ళి చేసుకోవడానికి వప్పుకున్నాడు.... బంగారు ...కు. ఆమెను చూసి కాదు- ఆమె డబ్బుని చూసి!...." సుబ్బారావు ఇంకా ...మేమో చెబుతున్నాడు. నా బుర్రలోకి ఏమీ ఎక్కడంలేదు. ✱

(ఆంధ్రభూమి సచిత్రవారపత్రిక 25-10-84)

# తప్పెవన్నువాడు...

ఆఫీస్ నించి అలసిపోయి ఇంటికి చేరుకున్నాడు రాజారావ్.

హాల్లో కుర్చీలో నీరసంగా కూలబడ్డ భర్తకి కాఫీ తీసుకొచ్చి అందించింది రమణి.

అతను కాఫీ తాగుతుంటే అతని కాళ్ళ దగ్గర కూర్చుని బూట్లు విప్పసాగింది ఆమె.

—ఆమె బూట్లను విప్పడం, అతను కాఫీ కప్పుని ఖాళీ చేయడం ఒకేసారి జరిగాయి.

కప్పుని కింద పెట్టబోతున్న రాజారావ్‌కి ఎదురు కుర్చీకింద కాల్చి పారేసిన సిగరెట్ ముక్క కనిపించింది.

అంటే - రాఘవ మళ్ళీ వచ్చాడన్నమాట!

అతని మనసంతా చికాకైపోయింది.

ఎంత మేనత్త కొడుకైతే మాత్రం అంత తరచుగా వచ్చి పోతుండాలా? అదీ తను లేనప్పుడు!

అతనికి బుద్ధి లేకపోతే రమణి బుద్ధేమయింది? ఆయన లేనప్పుడు రావడం బావుండదు, ఆయన వున్నప్పుడే రమ్మని గట్టిగా చెప్పొచ్చుగా?

అంత ఒకళ్ళని చూడకుండా మరొకళ్ళు వుండలేని వాళ్ళే అయితే పెళ్ళి చేసుకోవలసింది.

వెంటనే అతనికి రమణి మాటలు గుర్తుకొచ్చాయి - తనని పెళ్ళి చేసుకోవాలని రాఘవ కెంతో వుండేదని, పెద్దల పట్టుదలల కారణాన అది జరగలేదని!

ఆలోచించిన కొద్దీ రాజారావు బుర్ర వేడెక్కిపోసాగింది.

ఆఫీస్‌లో కొట్టుకుని కొట్టుకొని ఇంటికి చేరేసరికి ఇక్కడ అంత కన్నా భరించలేని వాతావరణం!

చటుక్కున కుర్చీలోంచి లేచి చెప్పులు తొడుక్కుని బయటికి బయల్దేరాడు.

"అదేమిటండీ, ఇప్పుడేగా వచ్చింది? అప్పుడే ఎక్కడికి బయల్దేరారు?...." ఆశ్చర్యంగా అడిగింది రమణి.

ఆమెకు జవాబివ్వాలనికూడా అనిపించలేదు రాజారావుకి. చర చరా ముందుకి కదిలాడు.

* * *

అలా అలా రోడ్లవెంట ఎంతసేపు తిరిగాడో తనకే అర్థం కాలేదు రాజారావుకి.

పార్కులో కూర్చోవాలనిపించింది. ఒంటరిగా కూర్చుంటే ఆలోచనల బాధ మరింత ఎక్కువైంది.

సినిమాకి వెళ్ళాలనిపించలేదు

ఏం చేయాలో పాలుపోలేదు.

కాళ్ళు నొప్పులు పుట్టేంతవరకూ తిరుగుతూనే వున్నాడు.

హఠాత్తుగా నిర్మల గుర్తుకొచ్చింది అతనికి. కాలేజీలో ఇద్దరూ క్లాస్‌మేట్స్ ఒకళ్ళంటే మరొకళ్ళకి - ఇద్దరికీ గౌరవం ఉంది. ఆమె

ఇంటికి వెళ్ళి కాసేపు కూర్చుంటే మనసుకి స్థిమితం చిక్కుతుందేమోనని పించింది రాజారావుకి.

ఆ ఆలోచన రావడమే తడవుగా వాళ్ళింటివేపు బయల్దేరాడు.

అతను వెళ్లేసరికి నిర్మల ఒక్కతే సోఫాలో కూర్చుని ఏదో పుస్తకాన్ని తిరగేస్తోంది.

అతన్ని చూడగానే తడబడుతూ లేచి నిలబడింది. "రండి.... రండి....'' ఆమె పలకరింపులో ఏదో అసహజత్వం గోచరించింది. రాజారావుకి.

తన మనసు చిరాకుగా వుంది కాబట్టి, తనకన్నీ అలాగే అనిపిస్తున్నాయి కాబోలునని సరిపెట్టుకుని కుర్చీలో కూర్చున్నాడు రాజారావు.

నిర్మల మాత్రం కూర్చోలేదు. అలాగే నిలుచుంది.

ఆమె ప్రవర్తన వింతగా తోచింది అతనికి. ఎప్పుడూ ఎంతో ఆప్యాయంగా పలకరించే ఈమెలో ఈ మార్పేమిటి?!

''భాస్కర్‌గారు రాలేదా?'' అడిగాడు తనే.

''ఆఫీస్‌నించి వచ్చారు. ఏదో పనిమీద బయటికి వెళ్ళారు....''

మాటి మాటికీ బయటికి చూస్తూ తడబాటుగా మాట్లాడుతున్న ఆమె తీరు అతనికి అర్థం కావడం లేదు.

నిర్మల ఎందుకు ఇలా ప్రవర్తిస్తోంది? తనిలా రావడం ఆమెకు ఇష్టం లేదా? ఇష్టం లేకపోవడానికి ఆమెకు కష్టం కలిగించేటట్లు తనేం చేస్తున్నాడు?

ఇక అక్కడ కూర్చోబుద్ధికాలేదు అతనికి. లేచి నిలబడ్డాడు.

"కూర్చోండి, అప్పుడే బయల్దేరారేం? ఆయన ఇప్పుడే వస్తానన్నారు, కూర్చోండి."

నిర్మల మాటలు రాజారావుకి మరింత కష్టం కలిగించాయి. తనకి ఎక్కువ పరిచయం ఎవరితో- నిర్మలతోనా? ఆమె భర్తతోనా? అసలు నిర్మల ఎందుకిలా ప్రవర్తిస్తోంది?

"అలా పోతూపోతూ వచ్చాను. మళ్ళీ తీరిగ్గా వస్తాలెండి...." బయల్దేరాడు రాజారావు.

"రాజారావుగారూ! ...'' రెండడుగులు వేశాడో లేదో వెనకనుంచి వినిపించిన నిర్మల కేక అతనిని నిలిపేసింది.

ఏమిటన్నట్లు వెనక్కి తిరిగాడు.

నిర్మల దగ్గరగా వచ్చింది.

''సారీ! మిమ్మల్ని నొప్పించాను. మీరెంత మంచివారో నాకు తెల్సు. నేనంటే మీకున్న అభిమానంకూడా నాకు తెల్సు. తెలియనిదల్లా మావారికే! ఆయన ఇప్పుడు నా అర్ధభాగం కదా-సర్వహక్కులూ నామీద వున్నాయ్. నా స్నేహితుల్తో నేను మాట్లాడినా తప్పని వాదించే హక్కుంది ఆయనకి. మాట్లాడవద్దని శాశించే అధికారం కూడా వుంది. ఏ అధికారం లేనిదాన్ని నేను. నన్ను క్షమించండి....'' అంతవరకూ బిగపట్టిన కన్నీరు ఆమె బుగ్గలమీదనుంచి కిందకి వురికింది.

ఛ....కేవలం మాట్లాడితేనే అంత అనుమానంతో వేగిపోతున్నాడా నిర్మల భర్త?! అనవసరంగా తనవల్ల ఆమెకు ఇబ్బంది. ఇంక మళ్ళీ నిర్మల ఇంటికి రాకూడదు....

''సారీ నిర్మలా!........నాకు తెలీకుండా నీకిబ్బంది కలిగించాను.'' గబగబా ముందుకి బయల్దేరాడు.

అతని మనసంతా నిర్మల భర్త మీద కోపంతో నిండిపోయింది. నిర్మలతో మాట్లాడితేనే ఆమె భర్త అంత నీచంగా ఆలోచిస్తున్నాడా అని

అతన్ని అసహ్యించుకుంటున్నాడే గాని- తనూ రమణిని ఇలాగే అనుమానిస్తున్నాడనే ఆలోచన తనకి రాలేదు.

అతను బయటపడిపోయాడు, తను బయట పడలేదు. అంతే తామిద్దరి మధ్య తేడా అని కూడా తను గమనించడం లేదు.

ఒకవిధంగా తనకన్నా అతనే నయమని, మనసులోవున్న విషాన్నంతటినీ బయటికి కక్కేశాడని .... తనలా మనసులో ఎన్నో విపరీత ఆలోచనలు పెట్టుకొని బయటికి మామూలుగా వుండడం చేతకాకపోవడమే అతనిలో 'మంచితనం' లేకపోవడం అని తను ఆలోచించడం లేదు.

అతని మనసంతా నిర్మల భర్తమీద చిరాకుతో నిండిపోయింది. అటువంటి భర్తలమీద నిప్పులు చెరుగుతోంది. *

(ఈవారం వారపత్రిక)

# రచన

ఈ మధ్య వస్తున్న కథల్ని చదివినప్పుడల్లా ఓస్....ఇంతేగా....అని అనిపిస్తుండేది. కానీ కథ రాయడం చాలా కష్టం అనే విషయం కథలు రాయాలనే రంగంలోకి దిగిన తర్వాత కూడా తెలీలేదు.

ఎన్నెన్నో వూహలు....

కాగితంమీద పెట్టాలని కూర్చున్నప్పుడు ఏవీ గుర్తుకొచ్చేవి కాదు. గుర్తుకొచ్చినా ఆ వూహలకి అక్షరరూపం ఇవ్వడం పెద్ద సమస్య!

ఎంతో కాలాన్ని, ఎన్నో కాగితాల్ని తగలేసి ఆఖరికి ఓ కథని దిగ్విజయంగా పూర్తి చేశాను. ఓ పత్రికకి పంపాను అంతకన్నా అర్జం టుగా అది వెనక్కి తిరిగి వచ్చేసింది.

తెలుగులో వున్న వార, పక్ష, మాసపత్రిక లన్నింటికి దాన్ని పంపాను. అన్ని చోట్లనుంచి వెనక్కి వచ్చేసింది.

విసుగు చెందని విక్రమార్కుడిలా మరి కొన్ని కథల్ని రాశాను. నన్నే వెదుక్కుంటూ వెనక్కి వచ్చేసేవి.

తిరిగి వచ్చిన కథల్ని చదివితే అన్నికథలూ మేగజైన్లలో చదువు తున్న కథలకన్నా బాగా వుంటున్నట్లే అనిపించేవి. మరెందుకు తిరిగి వస్తు న్నాయి? అర్థంగాని ప్రశ్న.

పట్టుదలతో నేను రాసే కథల సంఖ్య ఎలా పెరుగుతోందో, తిరిగి వచ్చే వాటి సంఖ్య అలానే పెరుగుతోంది.

ఉత్తరం కొట్టినందుకు కాదు, తోడికోడలు నవ్వినందుకు అన్నట్లు కథలు తిరిగి వస్తున్నందుకన్నా వాటిని చూసి నవ్వుతున్న భార్యామని చూసేసరికి విపరీతమైన బాధ వేసేది.

తన తమ్ముడే పెద్ద రచయిత అయినట్లు, నేనెందుకూ పనికిరాని చవటని అని ఆమె నవ్వుతున్నట్లనిపించేది. ఉక్రోషం వచ్చేది. పట్టుదల పెరిగిపోయేది.

ఫలితం పోస్ట్‌మన్‌కి పని పెరగడం తప్ప మరేమీలేదు!

ఇక లాభంలేదు. ముందు కథల స్వరూపాల్ని పరిశీలించాలి.

తాత్కాలికంగా కథల్ని రాయడం ఆపి, ఇంగ్లీషు, తెలుగుభాషల్లో కనిపించిన కథనల్లా చదవడం మొదలుపెట్టా.

ఎన్ని ఎక్కువ భాషల కథల్ని చదివితే అన్ని ఎక్కువ కథల్ని రాయవచ్చు అనే ఓ మిత్రుడు సలహాని పాటించి కష్టపడడం ప్రారంభించాను.

కష్టేఫలి అన్నట్లు చదివి కష్టపడి, కష్టపడి ఓ కథని రాశాను. బాగానే వచ్చినట్లనిపించింది. ఫెయిర్ చేస్తున్నప్పుడు దాని స్వరూపం మరి కొద్ది మారింది.

ఏమైనాసరే ఈ కథ ప్రచురించబడాల్సిందే! పట్టుదల పెరిగింది.

హఠాత్తుగా ఓ ఆలోచన వచ్చింది.

మా వూళ్ళోనే వున్న ఓ ప్రముఖ రచయిత రాజీవ్ గుర్తుకొచ్చాడు. అతని కథ పడని పత్రిక తెలుగులో లేదు. ఎన్నో కథలకి బహుమతుల్ని కూడా పొందాడు.

ఆయనకి నా కథని చూపించి అవసరమైన మార్పులు చేయిస్తే తప్పకుండా ప్రచురించబడుతుంది.

వెంటనే రాజీవ్ దగ్గరికి బయల్దేరాను.

నన్ను నేను పరిచయం చేసుకుని నా బాధని ఆయనకి చెప్పుకున్నాను.

''ఈ కథని చదివి మీ అభిప్రాయం చెప్పండి'' అంటూ ఆ కథని ఆయనకి ఇచ్చాను.

ఇంతలో శ్రీమతి రాజీవ్‌గారు కాఫీలు తేవటంతో మా మధ్య చిరు అంతరాయం కలిగింది.

కాఫీ తాగుతూనే రాజీవ్ కథని చదవసాగాడు.

నాకు కాఫీ గొంతు దిగడంలేదు. కథని చదువుతున్నప్పుడు అతని ముఖకవళికల్ని గమనిస్తూ ఒక్కో గుక్కే తాగసాగాను.

నా కాఫీ పూర్తికావడం, అతను కథ చదవడం ఒకేసారి జరిగాయి.

రిజల్టుకోసం ఎదురుచూస్తున్న విద్యార్థిలా వుంది నా పరిస్థితి!

''ఎలా వుంది?'' ఆత్రంగా అడిగాను.

''ఖచ్చితమైన అభిప్రాయం చెప్పమంటారా?''

"చెప్పండి...."

''ఇది పరమ చెత్తకథ, ఎవ్వరూ వేసుకోరు. ఒక్క ముక్కలో ఇదీ నా అభిప్రాయం.''

తలమీద కర్రతో కొట్టినట్లనిపించింది. అంత నిర్మొహమాటంగా ఆయన అలా అభిప్రాయాన్ని చెబుతాడని నేనూహించలేదు. అవాక్కయి అలా చూస్తూ కూర్చున్నాను.

"కథలు రాయడం అంత తేలిక కాదండీ! అది ఒక విద్య. అంత తొందరగా పట్టుబడేది కాదు. బాగా కృషి చేయాలి...." తను మొదట్లో కథలు పడక ఎన్ని ఇబ్బందులు పడింది, ఇప్పుడు తన చుట్టూ ఎడిటర్లు

ఎలా తిరుగుతున్నది. ఏవేవో అతను చెప్పుకుపోతున్నాడు. నాకు మనసుకి ఎక్కడంలేదు.

కేవలం సభ్యతకోసం కాసేపు కూర్చుని బయల్దేరాను.

ఇంటికి రాగానే కోపంతో ఆ కథని ముక్కలు ముక్కలు చేశాను. అంతటితో వూరుకోకుండా ఓ అగ్గిపుల్లతో వాటిని తగలేశాను. ఆ మంట మీద చెయ్యిపెట్టి మళ్ళీ కథలు రాయగూడదని వట్టేసుకున్నాను.

అది దాదాపు ఆరునెలల నాటి సంగతి!

అప్పటినుంచి మళ్ళీ కథ రాయాలనే వూహ రాలేదు. కానీ కథలు చదివే అలవాటుని మాత్రం మానుకోలేకపోయాను.

ఆ రోజు భోజనం కాగానే పడక్కుర్చీలో పడుకుని కొత్తగా వచ్చిన వారపత్రికని తిరగేయసాగాను.

హఠాత్తుగా నా చూపు ఒక పేజీలో నిలిచిపోయింది.

ఆ పత్రిక నిర్వహించిన కథల పోటీలో ప్రముఖ రచయిత రాజీవ్ కథకి మొదటి బహుమతి వచ్చింది అతనిఫోటో, వివరాలు ప్రచురించారు.

అతని కథని చదవసాగాను.

కథ పూర్తవడం, నా కళ్ళు గిర్రున తిరగడం ఒకేసారి జరిగాయి.

ఆ కథ చాలా బాగుంది.

కానీ—

ఆ కథనే నేను రాసుకుని తీసుకు వెళ్ళినప్పుడు అతను "పరమ చెత్త కథ'' అని వ్యాఖ్యానించాడు.

ఆ కథనే నేను కసితో ముక్కలు ముక్కలుగా చేసి తగల బెట్టాను.

కాకపోతే నాకన్నా అతను అనుభవం వున్న రచయిత కావడంతో దాన్ని మరింత అందంగా మలిచాడు— అంతే! *

(ఈవారం వారపత్రిక)

# కరెక్ట్ సైజ్

వాళ్ళు పిలవాలేగానీ సాధారణంగా ఏ పెళ్ళి 'మిస్' అవ్వను. అందర్నీ కలవవచ్చు. ఆనందంగా గడపవచ్చు. మా కజిన్స్ పదిమంది దాకా వున్నారు. వాళ్ళందరూ వస్తేచాలు సందడికి!

లత పెళ్ళికి అందరం వెళ్ళాం. అనుకున్న దానికన్నా ఆనందంగా లగ్నం అయిపోయింది. భోజనాలకి టైముండడంతో అందరం వాకిట్లోకి చేరాం. పెళ్ళికి వచ్చిన వాళ్ళందరూ చెప్పులు అక్కడ విడిచే లోపలికి వెళ్ళారు.

రకరకాల చెప్పుల్ని చూడగానే నాకో చిలిపి ఆలోచన వచ్చింది.

''రాఘవా! నీ చెప్పులు పాతవైపోయినట్లున్నాయిగా. వీటిలో ఏవి బావున్నాయో ఏరుకో..'' మా పిన్ని కొడుకుతో అన్నాను.

''నాకు ఆ బ్రౌన్ కలర్ చెప్పుల్స్ బావున్నాయ్!'' వెంటనే ఓ జతను సెలెక్ట్ చేసేసుకున్నాడు రాఘవ.

మా గోలలో-గుమ్మం దగ్గర అలా నిలుచుని గొడవచేస్తున్న మేము బయటికి వచ్చే వాళ్ళకి అడ్డమేమో అనే విషయం కూడా ఆలోచించలేదు.

పెద్దవాళ్ళయితే ఏదో చిన్న పిల్లలులే అని మమ్మల్ని తప్పించు కుని అటో ఇటో వెళ్ళిపోతున్నారు. ఉత్సాహం వున్న కుర్రాళ్ళయితే మాతో జాయిన్ అయిపోతున్నారు.

నవ్వులు....కేరింతలు....!

''ప్చ్....లాభంలేదు. చెప్పులు బావున్నాయి కాని చిన్నవై పోయాయి.'' వాటిని అక్కడే విడిచేస్తూ నిట్టూర్చాడు రాఘవ.

''నీకు సరిపోతాయేమో చూడరా వేణూ!..'' తన పక్కనే వున్న వేణుతో అన్నాడు రాఘవ.

''బాడ్‌లక్. పెద్దవయ్యాయి.''

''శ్రీనూనీకో... ?''

ఇలా ఒకళ్ళ నొకళ్ళు ప్రశ్నించుకుని అక్కడున్న అందరం చూశాము. కానీ ఎవరికీ సరిగా సరిపోలేదు.

అంతవరకూ మాటా పలుకూ లేకుండా కళ్ళతోనే తన ఆనందాన్ని వ్యక్తపరుస్తూ మా గోలని గమనిస్తున్న తన పక్కన కూర్చున్న వ్యక్తిని పలకరించాడు వేణు—

''మీకు సరిపోతాయేమో చూడండి మాష్టారూ!'' అంటూ.

అతను లేచి ఆ చెప్పుల్ని తొడుక్కున్నాడు. ఆశ్చర్యం!

అతనికి అద్దినట్లు సరిపోయాయి అవి.

''మీకు చక్కగా సరిపోయాయి, వుంచేసుకోండి మేష్టారూ!'' ఉచిత సలహా పారేశాడు వేణు.

''ఉంచేసుకోక పారేస్తానా? నాల్గుషాపులు తిరిగి వంద రూపాయలు పెట్టి, ఏరి కోరికొన్న చెప్పులు!'' చిన్నగా నవ్వుతూ జవాబిచ్చాడు ఆయన.

మా గోలకి ఒక్కసారి ఫుల్‌స్టాప్ పడ్డట్లయింది. నిముషం పాటు ఎవరినోటా మాట రాలేదు. *

(స్వాతి సపరివారపత్రిక 29-3-85)

# దారి చూపులు

మరో అయిదు నిముషాలు పడుతుంది. ఆమె అటుగా రావడానికి: అయిదు నిముషాలు కాదు- అరగటయినా నిల్చుంటాడు. ఆ నిరీక్షణలో ఆతనికి ఆనందం వుంది. ఆ తర్వాత ఆఫీసర్ చేతిలో ఎన్ని చివాట్లు తిన్నా లంచ్ తర్వాత ఆలస్యంగా వచ్చినందుకు భరించగలడు.

ఆ రోజు అనుకోకుండా ఆలస్యమైంది. సరిగ్గా రెండుంబావుకి ఆమె అటుగా పోతూ అతనికి కనిపించింది.

కళ్ళు మిరుమిట్లు గొలిపే అందం కాకపోవచ్చు ఆమెది. ఆమె కళ్ళలో వింత ఆకర్షణ వుంది. అవి పెదాలు కావు- రెండు లేత తమల పాకులు. ముక్కు, గడ్డం, ఆమె ముఖంలోని ప్రతీభాగం దేని ప్రత్యేకత దానిదే! అలాగే చూస్తుండాలనిపిస్తుంది.

ఆ కోరికలో కామం లేదు- ఆరాధన వుంది!

మర్నాడు సరిగ్గా రెండుంబావుకి కనిపించిందామె పుస్తకాలతో వెళ్తూ.

ఆ మర్నాడు....మర్నాడు....

అలా మరో నాల్గు రోజులు ఆమెని అదే టైమ్‌కి అటుగా వెళ్తుంటే చూశాడు శేఖర్.

ఆమెను చూసినప్పుడల్లా అతని మనసు ఓ క్రొత్త ఉద్వేగానికి లోనవసాగింది!

ఎన్నిపనులున్నా మానుకుని సరిగ్గా ఆ టయిమ్‌కి అక్కడికొచ్చి నిలుచుని, వెళ్తున్న ఆమెను మౌనంగా చూస్తూ ఆరాధించడం నేర్చుకున్నాడు.

సాయంత్రం సరిగ్గా ఆఫీసు వదలగానే తాము ఇంటికి వెళ్తుంటే ఆమె ఎదురొస్తుంటుంది. అప్పుడు రెండోసారి ఆ దేవత దర్శనం.

కేవలం ఆమెను చూడడంకోసమే అతను ఆఫీసుకి శలవు కూడా పెట్టకుండా రాసాగాడు.

ఏ కారణంచేతనయినా ఒక్కరోజు ఆమె కనిపించకపోతే అతను మనసు పడే అవస్థ వర్ణనాతీతం.

ఇప్పుడతను ఉన్న పరిస్థితి అదే!

నిన్న ఆమె అటుగా వెళ్తూ కనిపించలేదు.

ఎందుకు రాలేదు? వంట్లో బాగుండలేదో? మరేమి కష్టమొచ్చిందో?

ఒడ్డునపడ్డ చేపలా అతని మనసు కొట్టుకోసాగింది. ఈ రోజయినా వస్తుందో- రాదో? రకరకాల ఆలోచనలు ఈగల్లా అతని మనసుని ముసిరి బాధించసాగాయి.

దూరంగా కనిపించిన ఎర్ర చీరని చూడగానే అతని కళ్ళు తళుక్కుమన్నాయి.

ఆమే! సందేహం లేదు.

ఎంత దూరంనుంచి చూసయినా తన దేవతను గుర్తించగలడు.

తన పేరుకూడా తెలీని ఓ జీవి తనని చూడడం కోసం అంతగా తపిస్తోందని ఆమె ఊహించనయినా ఊహించగలదా? — అతనికి నవ్వొచ్చింది.

ఆమెను చూస్తే చాలు- మనసుకి అదో విధమైన తృప్తి. చూడకపోతే ప్రపంచమంతా శూన్యంగా అనిపిస్తుంది.

ఆమె వయసులో వున్న ఆడపిల్లే కావచ్చు. తానూ వయసులో వున్నవాడే కావచ్చు. ఆమెను చూస్తూంటే శారీరకమైన కోరికలు విజృంభించవు. మనసుకి మలయమారుతం తాకినట్లనిపిస్తుంది. ఆమెలో సాధారణంగా ఏ ఆడపిల్లలోనూ కనిపించని ప్రత్యేకత ఏదో వుంది. అదే తను ఆమెకోసం పరితపించేటట్లు చేస్తోంది!

ఆమె దగ్గరికి వచ్చేసింది.

అతని చూపులు ఆమెమీదే కేంద్రీకృతమయ్యాయి.

చూసీ చూడనట్లు ఆమె అతనివంక చూసింది. ఆ చూపులోని భావానికి విలవిల్లాడిపోయాడతను.

ఎంత నీచంగా చూసింది!

రోజూ ఇక్కడ నిలుచుని వళ్ళంతా కళ్ళు చేసుకుని చూస్తున్న ఈ రౌడీవెధవ ఎవడో- పనీ, పాటా లేనట్లుంది అన్నట్లున్నాయి ఆమె చూపులు.

ఆమె చూపుల తూపులకు తట్టుకుని చూసేసరికి పదడుగులు వెళ్ళిపోయింది.

ఆఫీసులోకి వచ్చి కూర్చున్న తర్వాత కూడా అతని మనసు మనసులో లేదు.

"ఏం గురూ! మీ హీరోయిన్ ఇవాళకూడా కనిపించలేదా? ఏమిటి అలా వున్నావ్?" పక్కసీట్లో కూర్చున్న రామచంద్రరావు జోక్ వేసాడు శేఖర్ మీద.

కనిపించకుండా వున్నా బావుండేది! కనిపించక నిన్న బాధ పెడితే, కనిపించి ఈ రోజు బాధ పెట్టింది!

ఎంత పీచంగా చూసింది!

తనని ఓ రౌడీగా జమకట్టి వుంటుంది.

ఇంతవరకూ ఆమెను కలకరించనుకూడా పలకరించలేదు. ఇప్పు డామెలో కలిగిన నీచభావాన్ని ఎలా పోగొట్టాలి?

వివరీతంగా ఆలోచించసాగాడు.

ఓ ఉత్తరం ద్వారా ఆమెకు తన మనోభావాలు తెలియజెయ్యాలి. అదీ ఈ రోజు సాయంత్రమే!

వెంటనే వుత్తరం రాయడానికి వుపక్రమించాడు.

పేరు తెలీదే- ఎలా సంబోధించాలి!

ఆఁ ...

"రెస్పెక్టెడ్ మేడమ్-

రోజూ మిమ్మల్ని పనిగట్టుకు చూస్తున్నానని నన్ను ఓ రోమియోలా భావిస్తారేమో భయంతో ఈ వుత్తరం రాస్తున్నాను. నాకు మీరంటే ఓ ఆరాధనాభావం. మిమ్మల్ని చూస్తుంటే అదో తృప్తి. అంతకుమించి మరే నీచభావాలూ నాలో లేవు. కాబట్టి దయచేసి నన్ను అపార్థం చేసుకోక మీ పేరు తెలియజేస్తారని ఆశిస్తున్నాను.

—శేఖర్."

ఈ రోజు సాయంత్రమే ఈ వుత్తరాన్ని ఆమెకి అందివ్వాలి. ఆమెలోని అనుమానాల్ని పూర్తిగా పోగొట్టాలి. మిమ్మల్ని చూస్తుంటే సాధారణంగా కలిగే నీచభావాలు కలగవని నచ్చచెప్పాలి- నిశ్చయించు కున్నాడు శేఖర్.

సాయంత్రం అయిదున్నర కాగానే బయటపడ్డాడు.

ఎవ్వరితోనూ కలవకుండా ఒంటరిగా బయల్దేరాడు. అలా బయల్దేరి తేనే ఆమెకు వుత్తరాన్ని అందించగలడు.

అతని ముందు కొలీగ్స్ నలుగురు జట్టుగా కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ వెళ్తున్నారు. వాళ్ళకి కొద్ది వెనగ్గా శేఖర్.

దూరంగా సందు మలుపు తిరిగి ఆమె కనిపించింది. శేఖర్‌లో దడ ప్రారంభమైంది.

"వురేయ్! మన శేఖర్ స్వప్న సుందరి వస్తోందిరోయ్!" ముందు వెళ్తున్నవాళ్ళలో ఒకడు గట్టిగా అన్నాడు.

"మనవాడు ఎన్నాళ్ళిలా మూగ వేదనని అనుభవిస్తాడు? ఇవాళ నిలబెట్టేద్దామా?" మరొకడు వెంటనే అందుకున్నాడు.

శేఖర్‌లో దడ పెరిగింది.

కొంపదీసి ఆమెను వీళ్ళు నిజంగా నిలదియ్యరు కదా!

ఇంతలో ఆమె దగ్గరికి వచ్చేసింది.

"హాయ్ మేడమ్! ఆగండి...." ఒకడన్నాడు.

తడబాటుతో ఆమె వేగాన్ని పెంచింది.

"వన్ మినిట్....వెళ్ళిపోదురుగాని...." వెనక్కి తిరిగారందరూ, తమని దాటి వెళ్ళిపోతున్న ఆమెను ఆపాలన్న దృష్టితో.

"వెరీ గుడ్ .... శేఖర్! నువ్వూ మా వెనుకే వున్నావా? అదిగో, నీ స్వప్నసుందరి వెళ్ళిపోతోంది. విషయం తేల్చేసుకో...." వెకిలిగా నవ్వాడొకడు.

శేఖర్ మొహంలో కత్తివేటుకి నెత్తురు చుక్కలేదు. ఆమె అతని పక్కకి వచ్చింది.

ఆమెకి అందించాలని వుత్తరాన్ని పట్టుకున్న చేతిని ముందుకు చాచలేకపోయాడు.

తలెత్తి పరమ నీచంగా అతని వంక చూసి, అసహ్యంగా తలని పక్కకి తిప్పుకుని ముందుకు వెళ్ళిపోయిందామె.

ఆమె కళ్ళు అందంగా కనిపించలేదు తనకి. నిప్పుల్ని కక్కుతున్నట్లనిపించాయి. చూపులు మలయమారుతం వీచినట్లు అనుభూతిని కలిగించలేదు. ఓ తుచ్ఛుణ్ణి చూసినట్లు చీత్కారాన్ని వెళ్ళగక్కాయ్!

తట్టుకోలేకపోయాడు శేఖర్. గుండెల్ని పిండినట్లు తల్లడిల్లసాగాడు.

విసవిసా వెళ్తున్న ఆమె పిరుదుల్ని అటు ఇటు తాకుతున్న జడ పడగ విప్పి బుసలు కొడుతున్న నాగుపాములా అనిపించసాగిందతనికి.

అక్కడ నిలబడలేక అటుగా పోతున్న ఆటోని కేకేసి ఎక్కేశాడు. మిత్రులు చెబుతున్న 'సారీ....' లేవీ అతని చెవిని చేరలేదు.

ఆ రాత్రల్లా రూమ్‌లో నిద్రలేకుండానే గడిపాడు శేఖర్.

తన దేవతని నడి బజారులో నవ్వులపాలు చేశాడు - అదే అతని వ్యధ.

తన ఆరాధన ఎవరికీ తెలీకుండా జాగ్రత్త పడాల్సింది - అదే తను చేసిన తప్పు. పదే పదే అనుకున్నాడు.

ఏ రోడ్డు మీదయితే ఇవాళ ఆమె ఏడ్పించబడిందో - అదే రోడ్డు మీద, అదే ప్రదేశంలో ఆమెకు క్షమాపణలు చెప్పుకోవాలి. అప్పుడే కొద్దిగానయినా తన మనసుకి ఊరట కల్గుతుంది.

ఎప్పటికో చిన్న కునుకు పట్టింది శేఖరానికి.

మర్నాడు రెండు గంటలకల్లా రోడ్ మీద నిల్చున్నాడు.

ఒక్కడే కాదు-నిన్న ఎవరెవరయితే ఆమెని మాటల్తో బాధించారో వాళ్ళందరితో! ఆమె దగ్గరకు రాగానే వాళ్ళందరి సమక్షంలో ఆమెకు క్షమాపణలు చెప్పుకోవాలి. తనదేవతకి తనవల్ల మనస్తాపం కలగకూడదు!

దూరంగా వస్తూ కనిపించిందామె.

ఇప్పుడామె మనసులో తను రాక్షసుడు! ఈ ఆలోచనే తట్టుకోలేకపోతోంది అతని మనసు.

ఆమె పక్కన ఆ యువకుడెవరు? ప్రియుడేమో? అందరిలా ఆమే ఈ ఆకర్షణకు అతీతురాలు కాదా?

శేఖర్ మనసు బాధతో మూల్గింది.

వాళ్ళు దగ్గరికి వచ్చేశారు.

అతని మొహంలో ఆమె పోలికలు స్పష్టంగా కనిపిస్తున్నాయి! బహుశా అన్న అయివుంటాడు!

వాళ్ళు శేఖర్ పక్కకి వచ్చేశారు.

వాళ్ళన్నయ్య వున్నా పర్లేదు. అందరి ముందూ నిన్నటి సంఘట నకు క్షమాపణలు చెప్పుకోవాలి.

గొంతు సవరించుకున్నాడు శేఖర్.

వాళ్ళిద్దరూ ఆగారు.

''ఇతనే అన్నయ్యా!....'' అందామె చిన్నగా.

''ఇదిగో మిష్టర్! ఉద్యోగం కూడా చేస్తున్నావ్. చదువుకునే ఆడ పిల్లల వెంటపడి గోల చెయ్యడానికి సిగ్గులేదూ? అంతగా వళ్ళు కొవ్వెక్కితే ఆ రంధి అణచుకోడానికి డబ్బులు పారేస్తే కోకొల్లలు ఇలా గౌరవ కుటుంబాలకి చెందిన పిల్లల వెనుకబడి గొడవచేస్తే పళ్ళు రాలగొట్టించాల్సి వస్తుంది జాగ్రత్త!....నీకేకాదు, నాకూ బాచ్ వుంది....మళ్ళీ ఇలా ప్రవర్తిం చారని మా చెల్లెలు చెప్పిందంటే మూకుమ్మడి సన్మానం చేయిస్తాను జాగ్రత్త!'' మొహం మీద కొట్టినట్లు చెప్పాలనుకున్న నాల్గు మాటలూ గడగడా చెప్పేసి చెల్లెలితో పాటు ముందుకు కదలిపోయాడతను.

నిశ్చేష్టులై నిలుచుండిపోయారు శేఖర్, అతని కొలీగ్స్.

ఎంత నీచంగా ఆమె మనసులో తను ముద్రించుకుపోయాడు! శేఖర్ కళ్ళు నీళ్ళతో నిండాయి.

తన దేవత, ఆమె అన్న మసక మసగ్గా కనిపించసాగారు అతనికి కన్నీళ్ళవల్ల!

*

(కలువబాల పక్షపత్రిక, జనవరి 1-15, 1987)

# ప్రతిధ్వని

శ్రీనివాసరావుకి చాలా ఆనందంగా వుంది.

అతని చిరకాల వాంఛ నెరవేరబోతోంది.

అన్ని పత్రికలూ అతని రచనల్ని తిప్పి కొట్టినా ఆకాశవాణి మాత్రం అవకాశమిచ్చి రచయిత ముద్ర వెయ్యబోతోంది!

ఈ విషయం అందరికీ తెలియాలి.

ఎలా?

తెగ ఆలోచించాడు.

ఆఫీసులో అందరికీ పెద్ద ఎత్తున పార్టీ ఇచ్చి, సగర్వంగా మరీ అనౌన్స్ చేశాడు. ఫలానా రోజున తన కథ రేడియోలో రాబోతోందని! అంతటితో వూరుకోకుండా 'దానిమీద మీమీ అమూల్యాభిప్రాయాల్ని ఆకాశవాణికి రాయం'డంటూ, అందర్నీ అభ్యర్థించాడు.

ఊళ్ళో వున్న వాళ్ళందరికీ చెప్పడం కాగానే పొరుగూళ్ళలో వున్న వాళ్ళందరికీ ఉత్తరాలు రాయడం ప్రారంభించాడు. మరో రెండు రోజులు చకచకా గడిచిపోయాయి. శ్రీనివాసరావు పబ్లిసిటీ కార్యక్రమం పూర్తయింది.

ముచ్చటగా మూడొందల రూపాయలు ఖర్చయిపోయినా అతనికేమీ బాధనిపించలేదు.

అందరూ తన కథని వింటారు. బాగుందంటూ ఆకాశవాణికి రాస్తారు. వాళ్ళు మరో కథని రాయమంటారు. అప్పుడూ తనిలాగే రాస్తాడు అందరికీ.... తన కథలకి తెగ రెస్పాన్స్ వస్తుందదంతో ఆకాశవాణివాళ్ళు తెగ కాంట్రాక్టులిస్తారు. రచయితగా తనకో ముద్ర పడిపోతుంది. అప్పుడు చచ్చినట్లు తనపేరు కోసమైనా మిగతా పత్రికలవాళ్ళు కథలు వేసుకుంటారు.

ఇలా రకరకాల కలలు కొనసాగిస్తూ కనసాగాడు.

శ్రీనివాసరావు కథ ప్రసారమయ్యే రోజు రానే వచ్చింది.

ఇంటి చుట్టుపక్కలవాళ్ళని, ఇంట్లోని వాళ్ళని అందర్నీ బలవంతాన అరెస్ట్‌చేసినట్లు రేడియో దగ్గరకి చేర్చాడు.

క్షణ క్షణం శ్రీనివాసరావులో టెన్షన్ పెరగసాగింది.

కథ ప్రసారమయ్యే టైమ్ అయింది

చటుక్కున రేడియో వాల్యూమ్ పెంచి కూర్చున్నాడు శ్రీనివాసరావు.

చీమ చిటుక్కుమన్నా వినిపించే శబ్దం ఒక్కక్షణం—

హఠాత్తుగా రేడియా అరిచింది.

"ప్రకటించిన కార్యక్రమానికి బదులుగా అనివార్య కారణాలవల్ల సుబ్బలక్ష్మిగారి, రుతువులు ఎలా ఏర్పడతాయి - ప్రసంగం."

ఒక్కసారి అందరూ ఘొల్లుమన్నారు.

తన కథ ప్రసారం ఎందుకాగిపోయిందో అర్థంకాక తికమకపడుతున్న శ్రీనివాసరావు కూడా భళ్ళున నవ్వాడు. కానీ వెంటనే గుర్తొచ్చింది- తన కథ ప్రసారం ఆగిపోయిందని! అంతే. సీరియస్సైపోయాడు.

సీరియస్ అయి ఏం చెయ్యగలదు? ఎదురుగా ఆకాశవాణి వాళ్ళు ఎవరైనా వుండేనే కదా? ఉన్నవాళ్ళందరూ తన కథ వినడానికి చేరిన వాళ్ళు! కోపం మాటటుంచి వాళ్ళముందు తల ఎత్తుకు తిరగడం ఎలా?

ఆఫీస్‌కి వెళ్తే అక్కడ నవ్వేవాళ్ళు వుంటారు! వాళ్ళందర్నీ ఎలా ఫేస్ చెయ్యడం?....

"శ్రీనివాసరావుగారూ! మీ కథ రానట్టేగా? ఇక వస్తాం...." అన్నారు ఒక్కొక్కళ్ళే లేచి బయల్దేరి.

తను కూర్చున్న పళానే లోపలికి దిగిపోతే బాగుండని తలపోశాడు శ్రీనివాసరావు.

అందరూ వెళ్ళిపోయారు.

"పరువు తీశారు కదండీ!.... రేపటినుంచి తలెత్తుకుని ఎలా తిరగ్గలం?...." మూతి మూడువంకర్లు తిప్పి లోపలికి వెళ్ళిపోయింది శ్రీనివాసరావు శ్రీమతి.

మరింత సిగ్గుతో కుంగిపోయాడు శ్రీనివాసరావు.

ఇకముందు పొరబాటున కూడా కూడా కథలు రాయకూడదని, రాసినా రేడియోకి పంపకూడదని వట్టేసుకున్నాడు.

అవమానాల మధ్య ఒక వారం అతి భారంగా గడిచింది శ్రీనివాసరావుకి.

ఆ రోజు అనుకోకుండా ఇంట్లో వున్న శ్రీనివాసరావు చెవుల్లో రేడియో కార్యక్రమం దొచ్చుకుపోసాగింది.

రేడియో కార్యక్రమాలపై శ్రోతల అభిప్రాయమాలిక - అనౌన్స్‌మెంట్ రాగానే ఓ బొంగురు గొంతు ప్రారంభమైంది:

"మేము ప్రసారం చేస్తున్న కార్యక్రమాలన్నింటినీ శ్రద్ధగా విని తమ అభిప్రాయాలు రాస్తున్న శ్రోతలకు ముందు మా ధన్యవాదాలు. గతవారం ప్రసారమైన శ్రీనివాసరావుగారి కథ నచ్చిందంటూ మా కార్యాలయానికి అసంఖ్యాకంగా ఉత్తరాలు వచ్చాయి. ముందు వాటిని పరిశీలిద్దాం...." అంటూ ఆ బొంగురుగొంతు కొన్ని పేర్లను కరువులేనట్లుగా ఏకరువు పెట్టసాగింది.

ఆశ్చర్యం....! అవన్నీ అతని బంధు స్నేహితుల పేర్లు....!!

అంటే....వాళ్ళందరూ ఆ రోజు రేడియో వినకుండా మొహమాటానికి రాస్తే రేడియోవాళ్ళు ఏ మొహంతో చదువుతున్నారో అయోమయంగా అనిపించింది శ్రీనివాస్‌కి.

ఇంతలో శ్రీమతి నవ్వు అతి వికారంగా తగిలింది అతని చెవులకి.

భరించలేకపోయాడు.

చటుక్కున ఒక్కదూకులో రేడియో చేరుకుని దాన్ని కట్టేశాడు.

ఇప్పుడు రేడియో నుండి వచ్చే చిన్న ధ్వని విని కూడా భరించలేని స్థితిలో వున్నాడు శ్రీనివాసరావు. అఫ్‌కోర్స్- కథలు రాయటం మానేశాడని వేరే చెప్పనక్కర్లేదనుకోండి *

(హాస్యప్రభ మాసపత్రిక)

# అబల

ముక్కు-మొహం తెలీని ఓ ఆడపిల్లని తీసుకొచ్చి ఎదురుగా కూర్చోబెట్టి 'ఈ అమ్మాయిని అర్థంటుగా చూసి నీ జీవిత భాగస్వామినిగా తగునో, కాదో చెప్పు' అంటే చాలా కష్టం.

ఈ విషయం పెళ్ళి చూపులకి వెళ్ళినప్పుడుకానీ నాకు తెలీలేదు.

అమ్మ, నాన్నగారు, అక్కయ్య, బావతోపాటు వెళ్ళాను - అమ్మాయిని చూడడానికి!

మాకు మర్యాదలు చేయడానికి ఆ ఇంటిల్లపాదీ పడుతున్న అవస్థలు చూస్తుంటే జాలేస్తోంది. కానీ మావాళ్ళు 'ఇది మా హక్కు' అన్నట్లు ఠీవిగా కూర్చుని, టిఫిన్ తింటూ అమ్మాయి గురించి అన్ని వివరాల్నీ సేకరిస్తున్నారు.

టిఫిన్లయ్యాయి.

''పార్వతీ! అమ్మాయిని తీసుకురా....'' లోపలికి చూస్తూ కేకేశాడు పిల్లతండ్రి పరంధామయ్యగారు.

నాలో టెన్షన్ క్షణ క్షణానికి పెరిగిపోతోంది. ఆ అమ్మాయి ఎలా వుంటుందో? ఒకవేళ నచ్చలేదంటే ఆ అమ్మాయి ఎన్ని తిట్టుకుంటుందో?

అటు ఇటు తల్లి, అక్క వెంటరాగా హాల్లోకి అడుగు పెట్టింది పెళ్ళికూతురు.

ఒక్కసారి వులిక్కిపడ్డాను.

కరుణ!

'ఆ అమ్మాయి వాళ్ళతండ్రి తొందరపడుతున్నాడు .... ఒకసారి వచ్చి పిల్లను చూసి వెళ్ళు...పిల్ల నీకు నచ్చితేనే మిగతా విషయాల గురించి మాట్లాడతాను' అంటూ నాన్నగారు పదేపదే వుత్తరాలు రాయడంతో శలవు పెట్టివచ్చాను. పిల్లపేరు 'కరుణారుణ' అంటే ఒక్క క్షణం కరుణ గుర్తుకొచ్చింది గానీ ఇలా ఆమే తటస్థిస్తుందని అనుకోలేదు. ఆనందంతో కూడిన దడ ప్రారంభమైంది.

కరుణ ఎదురుగా వేసిన చాపమీద కూర్చుంది - తలవంచుకుని.

ఆమెనలా చూస్తుంటే చాలా ఆశ్చర్యంగా వుంది. కాలేజీరోజుల్లో ఎవరిముందూ తల వంచడం అనేది ఎరుగని కరుణేనా నా ముందు తల వంచుకుని కూర్చున్నది!

పెళ్ళిచూపులకి వస్తోంది నేనని ఆమెకు తెల్సా?

"నీ పేరేమిటమ్మా?" నాన్నగారు అడిగారు.

"కరుణ...." నెమ్మదిగా తలెత్తింది.

నన్ను చూసింది.

ఆమె కళ్ళల్లోనూ ఆశ్చర్యం!

అంతే! వంచిన తలను మళ్ళీ ఎత్తలేదు. అమ్మ, అక్కయ్య అడిగిన ప్రశ్నలకు తలెత్తకుండానే జవాబిచ్చింది.

"ఇక అమ్మాయిని తీసుకెళ్ళండి లోపలికి...." నాన్నగారు అన్నారు.

ఆమాట అన్నదే ఆలస్యం లేచి లోపలికి వెళ్ళిపోయింది కరుణ.

పెద్దవాళ్ళందరూ ఏమేమో మాట్లాడుకుంటున్నారు. నా ఆలోచనలు మాత్రం గతంలోకి పరుగెత్తాయి.

ఫైనలియర్ కల్చరల్ వీక్స్‌లో వెయ్యడానికి ఆడవాళ్ళందరూ కలసి ఓ నాటికకి తయారవసాగారు.

సాయంత్రం పూట ఆడిటోరియంలో రిహార్సల్స్ జరుగుతుండేవి.

రవిశంకర్, శివకుమార్, బాలకృష్ణ, భాస్కర్, రామచంద్రరావు- మా బాచ్ అందరం ప్రాంప్ట్‌గా అయిదయ్యేసరికల్లా అక్కడికి చేరుకునే వాళ్ళం. అప్పుడప్పుడూ రిహార్సల్ వెయ్యడానికి వచ్చేవాళ్ళయినా మానే వాళ్లు గాని మాలో ఒక్కడూ ఒక్కరోజూ మానేవాడు కాదు.

దూరంగా కూర్చుని వాళ్ళ రిహార్సల్స్ గమనిస్తూండేవాళ్ళం.... వాళ్ళకి వినిపించకుండా రకరకాల కామెంట్లు చేస్తూండేవాళ్ళం.

ఒకరోజు రవిశంకర్‌కి వింత ఆలోచన వచ్చింది

"వాళ్ళందరిలోకీ నాకు జయలక్ష్మి బాగుంది. మీ ఎవరెవరికి ఎవ రెవరు నచ్చారో ఎన్నుకోండి. నాటిక అయిపోగానే ఎవరి అభిమానానికి వాళ్ళు ప్రత్యేక బహుమతిని చదివిద్దాం ఓకే....." అన్నాడు.

అందరూ తలా ఓ పిల్లని ఎన్నుకున్నారు.

ఎవ్వరూ ఓ పిల్లని పట్టించుకోలేదు.

బహుశా చామన ఛాయలో వుండడమే అందుక్కారణమేమో!

నాకు జాలేసిందామె మీద.

అందుకే చటుక్కున అనేశాను- "అందరిలోకీ ఛాయ తక్కువైనా చూడడానికి కరుణ బాగుంటుంది. పైగా బాగా నటిస్తోంది కూడా!"

ఆ రోజునుంచీ ఆమె అంటే విపరీతమైన అభిమానం ...రోజు రోజుకీ అది పెరసాగింది.

నాటిక అయిపోగానే ముందుగా అనుకున్నట్లు ఎవరికి నచ్చిన పిల్లకి వాళ్ళం 'బాగా నటించినందుకు' అంటూ ప్రత్యేక బహుమతులు స్టేజిమీద ఇప్పించాం.

ఆ మర్నాటి నుంచి దిగులు....

సాయంత్రమయేసరికి కాళ్ళు ఆడిటోరియమ్ వేపు దారితీసేవి.

ఖాళీ ఆడిటోరియమ్‌ను చూడగానే మనసు బావురుమనేది. నా మనసులోని బాధ ఎవరికి చెప్పుకోవాలి?

కరుణని చూడకుండా ఒక్కరోజు కూడా వుండలేననిపించింది.

అందుకే ఆ రోజు కాలేజి కాంపస్‌లో ఒంటరిగా కనిపించిన ఆమె వెంటపడ్డాను.

"ఎందుకు నా వెనుక అలా వస్తారు?...." నా అవస్థని గమనించి చిరాకుగా అంది కరుణ.

ఆసలే నెర్వస్‌గా వున్న నాకు ఆ దెబ్బతో నోటిమాట కూడా రాలేదు.

"మీకే చెప్పేది! నా వెనక పడ్డారంటే మర్యాదగా వుండదు." మరోసారి గర్జించింది.

"మరి....మరి....నేను...." గొంతులో ఏదో అడ్డం వచ్చట్లు లోపలి భావాలు లోపలే కూరుకుపోతున్నాయ్.

"ఏమైంది మీకు?"

"మిమ్మల్ని ప్రేమించాను...." కళ్ళు మూసుకుని చటుక్కున అనేశాను.

ఛెళ్ళుమంది చెంప!

కళ్ళు తెరిచిన తర్వాత కూడా సరిగా కనపడలేదు. తెలీకుండానే కళ్ళవెంట నీళ్ళొచ్చేశాయి. ఆ కన్నీళ్ళు కళ్ళని మరింతగా కప్పేసాయి.

మరుక్షణంలో ఏదో గుర్తుకొచ్చి చుట్టూ చూశాను.

ఎవ్వరూ లేరు!

అప్పటికే క్లాసులు మొదలై పోవడంతో అందరూ క్లాసుల్లో వున్నారు. మేమిద్దరమే ఆలస్యంగా వస్తున్నారు.

'ప్రేమించాను' అన్న మాత్రాన ఆవిడకంత కోపం ఎందుకొచ్చిందో నాకు అర్థం కాలేదు. నేనేమీ చెయ్యిపట్టుకోలేదుగా చెంపలు పగులగొట్ట డానికి?

అంతవరకూ ఆమె మీదున్న ప్రేమకాస్తా కోపంగా మారిపోయింది. ఆ తర్వాత ఎప్పుడూ ఆమెని కన్నెత్తికూడా చూడలేదు.

ఇవాళ తిరిగి ఇలా కనిపించింది!

''వెళ్దాం పదరా!....'' నాన్నగారి మాటలతో ఆలోచనల్లోంచి బయటపడ్డాను.

ఆ ముసలాయన తన కూతురు గురించి తెగ చెబుతున్నాడు.

''ఓ వారం రోజుల్లో ఏ విషయం తెలియజేస్తాం.'' మా ఆటో బయల్దేరబోయే ముందు అన్నారు నాన్నగారు.

ఆ మర్నాడే బయల్దేరి వచ్చేశాను నేను.

''నీ అభిప్రాయం ఏమిట్రా?'' అంటూ అడిగారు నాన్నగారు వచ్చేసేప్పుడు.

''ఆలోచించుకుని రాస్తాను'' అని చెప్పాను

చెంప పగలగొట్టిన పిల్లని భార్యగా స్వీకరించాలా- వద్దా? అన్న సందిగ్ధంలో మరో నాల్గు రోజులు గడిచిపోయాయి.

ముక్కూ- మొహం తెలీనివాణ్ణే చెంప పగలగొట్టిన ఈమె రేపు నా మాట వింటుందా? అదే నా భయం.

నా అనుమానాల్ని పటాపంచలుచేస్తూ ఆ రోజు ఉత్తరం వచ్చింది.

కరుణ ఉత్తరం రాసింది! ఎందుకో నా గుండెలు దడదడ లాడాయి.

పెళ్ళి చూపులంటూ అంగట్లో బొమ్మలను చూసినట్లు ఆడపిల్లల్ని చూస్తూ - కనీసం అభిప్రాయాన్ని వెంటనే తెలియజెయ్యాలనే జ్ఞానంలేని నువ్వేమి మనిషివంటూ ఛెడా మడా దులిపేస్తూ రాసిందేమో ఉత్తరం!

భయపడుతూనే కవర్ని చింపి, చదవసాగాను.

''రాధాకృష్ణగారికి—

మీరు వారంరోజులైనా ఉత్తరం రాయకపోయేసరికి మీ అభిప్రాయం అర్థమైంది కానీ నాదో చిన్న రిక్వెస్ట్.

ఆ రోజు నా వెంటపడి 'ప్రేమించాను' అంటూ వెర్రి మాటల్ని చెప్పిన ఎంతోమంది చెంపల్ని పగలకొట్టాను. పొగరుమోతుతనంతో కాదు-కేవలం నా భద్రత కోసం. ఇవాళ పెళ్ళిచూపుల కొచ్చిన వాళ్ళందరి ముందూ తలవంచుకుని కూర్చుంటున్నాను - భార్యగా నా స్థానం ఎవరి దగ్గర దొరుకుతుందోనని.

కానీ మగవాళ్ళలో అప్పుడు లేని ధైర్యం, అహంభావం ఇప్పుడు వస్తుందని తెల్సు.

ఆ ధైర్యంతోనే మీరు నామీద ప్రతీకారం తీర్చుకోడానికి నేను నచ్చలేదని అంటారనీ నాకు తెల్సు.

అయినా ఈ ఉత్తరం ఎందుకు రాస్తున్నానంటే దయచేసి నామీద "అహంభావి, పొగరుమోతు' అనే ముద్రలువేసి మాత్రం నిరాకరించకండి. కట్నం కాంపిటిషన్‌కే తట్టుకోలేకపోతున్న నాన్నగారు ఈ బిరుదులు కూడా వచ్చాయంటే నా పెళ్ళి అసలు చెయ్యలేనని బెంబేలుపడిపోతారు.

మరొక్కమాట.... చెంపదెబ్బ కొట్టానని ఉక్రోషంతో విజృంభించక నాతోనేకాక మరే ఆడపిల్లతోనూ ఇలా మాట్లాడడానికి సాహసించని మీ మార్పుకోసం అలా చేశానని అర్థం చేసుకుంటారని ఆశిస్తూ-

మిమ్మల్ని భర్తగా పొందే స్త్రీని అభినందిస్తూ—

ఓ అబల

"కరుణ"

తల తిరిగిపోయింది ఆ ఉత్తరాన్ని చూడగానే! నేనూహించినట్లు ఉత్తరం వున్నా నా కింత బాధ అనిపించేది కాదేమో!

ఎంతటి కాయా కత్తిపీటకు లోకువే అన్నట్లు ప్రతీ ఆడపిల్లా ఇలా 'అబల'గా మారిపోవలసిందేనా?

నన్ను చెంపదెబ్బ కొట్టడంలో ఆమె తప్పేమిటి? ముక్కు మొహం తెలీనివాడు వెనుకబడి 'ప్రేమ-పెళ్ళి' అంటే ఏ ఆడపిల్ల వూరుకుంటుంది'

నో.... కరుణ అలా బేలగా మారడానికి వీల్లేదు. ఆమె ఇదివర కటిలా ధైర్యంగా, సబలగానే వుండాలి.

వెంటనే ఉత్తరం రాసి పడేశాను.

ఆ రోజుల్లో కేవలం కుర్రతనం కాబట్టి మాట అని వూరుకున్నానని, అప్పుడు గుండెల్లో పెట్టుకుని పూజించడానికి సిద్ధంగా వున్నానని, నీలాంటి భార్యకోసమే వేచి వున్నానని, త్వరలోనే పిల్ల నచ్చింది- లగ్నాలు పెట్టు కుందామని మా నాన్నగారి దగ్గరినుంచి వుత్తరం వస్తుందని.

ఆ రోజే నాన్నగారికి రాశాను—

పిల్ల నచ్చింది — మిగతా విషయాలు మాట్లాడుకొమ్మని! *

(స్వాతి సపరివారపత్రిక, 14-3-86)

# జీవితం - సినిమా - నటన

సినిమా బాగుందన్న టాక్ రావటంతో వచ్చి రెండు నెలలైనా జనం బాగా వున్నారు. ముందే రావడం మంచిదయింది. రెండు టికెట్లని అడ్వాన్స్ బుకింగ్‌లో తీసుకున్నాం.

''ఇంకా చాలా టైముందిగా....అలావెళ్ళి కామత్‌లో ఓ కాఫీ తాగొద్దామా?'' శ్రీవారు ఆ మాట అనడమే ఆలస్యం తలూపాను.

ఇద్దరం హోటల్‌కేసి దారితీశాం.

''సార్! .. '' హోటల్లోకి అడుగుపెట్టబోతున్న వాళ్ళమల్లా ఒక్క క్షణం ఆగాం.

దీనంగా మా వంకే చూస్తున్న ఆయనకి అరవై సంవత్సరాలపైనే వుంటుంది వయసు. చిరిగిన దుస్తులు, మొహంలో దైన్యం. బ్రతికిచెడ్డ వాడిలా అనిపించి జాలేసింది.

''నువ్వా? ...నీ నటన నాకు తెలుసులే!'' నిర్లక్ష్యంగా ఆయనవంక ఓ చూపు విసిరి ముందుకు కదిలారాయన.

"సార్!....పెద్దవాణ్ణి.... రెండ్రోజులైంది భోంచేసి....కాళ్ళు వణుకుతున్నాయి....'' ఆయన మాట కూడా వణికింది.

ఆయనమీద జాలి, మావారిమీద కోపం వచ్చింది.

''ఇప్పుడు మనం కాఫీ తాగకపోతేనేం? ఆ పైసలు ఆ ముసలాయనకిస్తే ప్రాణాన్ని నిలబెట్టుకుంటాడు'' మావారి చెయ్యి పట్టుకుని లాగుతూ అన్నాను.

''అతన్ని గురించి చెబుతా, లోపలికిరా....''

బాధనిపించినా సాయం చేయలేని నా పరిస్థితికి నా మీద నాకే కోపం వచ్చింది. మౌనంగా ఆయన్ననుసరించాను.

కాఫీ తాగుతుంటే ఆయన మొదలుపెట్టారు .......

"మూడు నాల్గు నెలల క్రితం నేను, రాజారావు ఓసారి ఈ హాల్‌కే సినిమాకి వచ్చాం. అప్పుడూ ఇలాగే టైముండడంతో కాఫీ తాగడానికి ఇక్కడికే వచ్చాం. అప్పుడూ ఈ ముసలాయన ఇలాగే దర్శనమిచ్చారు. జాలేసింది. అతనికి అర్ధరూపాయి ఇచ్చినా సినిమా చూడకుండా వెనక్కి తిరగాల్సిన ఆర్థిక పరిస్థితి అప్పుడు మాది! అయినా ఆయనకి ఏదైనా టిఫిన్ తినమని ఓ రూపాయి ఇచ్చి, మేం కాఫీ తాగి సినిమా చూడకుండా వెనుదిరిగాం....''

''ఇప్పుడూ అలాగే చేద్దాం....''

"నేను చెప్పేది పూర్తిగా విను. మేము వెళ్ళిపోతూ హాల్‌కి చూశాం. బుకింగ్ దగ్గరున్న క్యూలలో ఒకదానిలో ముసలాయన! మేము సినిమా మానుకుని ఆయనకి సినిమా చూపించామన్నమాట! అర్థమైందా?"

నాకు ఆశ్చర్యం వేసింది.

అంత అమాయకంగా కనిపించే ఆ ముసలాయన అంతగా నటించగలడా?

కాఫీ పూర్తిచేసి థియేటర్ చేరుకున్నాం.

థియేటర్ బయట ఆ సినిమా హీరోగారి అభిమానుల కోలాహలం పెరిగిపోయింది. ఆ సినిమాలో హీరో నటనకి ఆ రోజే ఉత్తమ నటుడి అవార్డు వచ్చిందిట.

కుంటివాడుగాను, గుడ్డివాడుగాను, ధనవంతుడుగాను....రకరకాల వేషాల్లో పెద్ద కటౌట్లు హాలుముందు వేళ్ళాడుతున్నాయి. వాటన్నింటినీ దండలతో కప్పేశారు అభిమానులు

ఆ థియేటర్ ముందు ఎవరినోట విన్నా ఆ హీరోగారి నటనా వైభవం గురించే!

సినిమా మొదలైంది.

రకరకాల వేషాల్లో హీరో ప్రేక్షకుల కంట నీరు పెట్టించాడు. ఆయన అన్ని వేషాలు మార్చినా ఎవ్వరూ గుర్తుపట్టరు. తన ప్రతిభతో దుర్మార్గుల ఆట కట్టిస్తాడు ఆఖరికి. ఆయన ఉత్తమ నటుడి అవార్డుకి అర్హుడు అనిపించింది.

మా వారికి కూడా ఆయన నటనెంతో నచ్చింది. థియేటర్ బయటికి వచ్చిన తర్వాత కూడా హీరోగారి నటనని పొగుడుతూనే వున్నారు.

రోడ్డుమీదకివచ్చి నిలబడ్డాం.

"బాబూ!"

వెనక్కి తిరిగాం.

చేతిలో కర్రతో ముసలాయన. ఓ కంటికి కట్టు కట్టి వుంది!

"ఆపరేషన్ అయింది బాబూ! .... ఈ మందులు కావాలి...." చేతిలోని చీటిని ముందుకు చాపాడు.

నాకు వెంటనే మా నాన్నగారు గుర్తుకొచ్చారు. ఆయనకి శుక్లాల ఆపరేషన్ చేయించాలి.

"సరిపోయింది.... మళ్ళీ ఈ వేషంలో ప్రత్యక్షమయ్యావా?" శ్రీవారి గొంతులో కోపం తొణికిసలాడింది.

మరోసారి పరిశీలనగా ఆ ముసలాయనవంక చూశాను.

''నువ్వు గుర్తుపట్టలేదా? ఇందాక హోటల్ దగ్గర ఆకలంటూ ఆ ఘోషించిన ముసలాయనే- ఇప్పుడే ఆపరేషన్ అయిన అవతారంలో...."

మావారి మాట పూర్తికాకముందే ఆ ముసలాయన అక్కడనుండి ముందుకి కదిలాడు.

ఆ సినిమాలో హీరోగారు అన్ని వేషాలు మార్చినా ఎవ్వరూ గుర్తుపట్టలేదు- ఆఖరికి భార్య కూడా! ఈ ముసలాయన మారువేషాన్ని ఒక్కసారి చూసినవాళ్ళే పట్టేస్తున్నారు! ఆయన నటనకి వేలకివేలు డబ్బుతో పాటు అవార్డులు కూడా ఇచ్చినవారు ఈయన నటనకి పైసా ఇవ్వకపోగా అసహ్యించుకుంటున్నారు. ఎక్కడుంది తేడా? అర్థం కాలేదు నాకు.

"ఏమండీ.... నాకోరూపాయి ఇవ్వరూ?" అడిగాను.

జేబులోంచి రూపాయితీసి ఇచ్చారు.

దాన్ని తీసుకుని గబగబా ముసలాయనవేపు కదిలాను.

నన్ను చూస్తూనే ఆయన అక్కడినుంచి వెళ్ళిపోబోయాడు.

"ఆగండి...." దగ్గరికి వెళ్ళి రూపాయి ఆయన చేతిలో కుక్కి ఎంత వేగంగా వెళ్ళానో అంత వేగంగానూ వెనక్కి తిరిగాను.

ఆ ముసలాయనకి, మా వారికి, అక్కడున్న ఎవ్వరికీ నా ప్రవర్తన అర్థంకాలేదు. అయోమయంగా చూడసాగారు. *

(స్వాతి సపరివార పత్రిక 14-2-86)

# చీరా! చీరా! నీ ఖరీదెంత?

బొంబే నుంచి కొత్తస్టాక్ వచ్చింది. దాన్ని సర్దుకోవడంలో "లక్ష్మీ సిల్క్ హౌస్" స్టాఫ్ బిజీగా వుంది.

రాత్రి పది దాటినా తలుపుల్ని లోపల నుంచి వేసుకుని స్వామి, అతని సహచరులు సతమతమైపోతున్నారు.

వైరైటీవారీగా సర్దడం.... వాటిమీద కోడ్‌ని అనుసరించి చీరలకు తగిలించివున్న టాగ్‌లమీద రేట్లు వెయ్యడం.... బిజీ....బిజీ....!

ఆ కోడ్ నెంబరు దానిమీద రేటుతో వాళ్ళందరూ పసిగట్టేయగలరు ఆ చీరమీద ఎంత లాభం వేసుకున్నది! దాన్నిబట్టే కస్టమర్తో బేరాన్ని వప్పుకునేది!

ప్రతీ కస్టమర్‌కి బేరంచేసి కొంటేనే తృప్తి వుండేది. వాళ్ళకి ఆ తృప్తినివ్వాలంటే చీరమీద ఖచ్చితమైన రేటు వేసుకుంటే ఇబ్బంది! అందుకని ఓ యాభై రూపాయలు ఎక్కువ వేసుకుని కస్టమర్ గీచి గీచి బేరమాడిన తర్వాత ఓ పాతిక రూపాయలు తగ్గిస్తే ఇద్దరికీ ఆనందం! ఇది స్వామి సూత్రం! ఆ సూత్రం కోసం తహ తహ....!!

"ఈ బ్లూ సారీ మనకెంతపడింది?" అసిస్టెంట్‌ని అడిగాడు స్వామి.

"నూటయాభై...."

"అయితే దానిమీద రెండువందలు వెయ్యి...."

ఆ చీర తగిలించి వున్న టాగ్‌మీద రెండువందలు వేశాడు అసిస్టెంట్.

చకచకా అన్ని చీరలమీద ధరలు వేసేస్తున్నారు.... ఎంత రాత్రయినా ఈరోజే చీరలన్నిటికి ధరలు వెయ్యడం అయిపోవాలి....

* * *

''స్వామీ! నీ దగ్గర పదేళ్ళనుంచి బట్టలు తీసుకెళ్తున్నాను.... నాలాంటి వాళ్ళకి కూడా ధర తగ్గించకపోతే బాగుండదు....'' బ్లూ సారీని చేతిలోకి తీసుకుంటూ అడిగాడు బాబూరావు.

''ఆ చీర అంతకన్నా తక్కువకి రాదండి! నూటయాభైలో కావాలంటే ఈ చీర తీసుకోండి....'' మరో చీరని చూపించాడు లక్ష్మీసిల్క్ ప్రొప్రయిటర్ స్వామి.

''నాకు ఈ బ్లూ శారీయే నచ్చింది....అదక్కర్లేదు.... పోనీ, నూట డెబ్బయిఅయిదుకియ్యి....''

''మాకు పడదండి ఆ రేటు. మీరు కాబట్టి నూటతొంభైకిస్తాను....''

"సరే, ఇద్దరికీ మధ్యంగా వుండేట్లు నూటి ఎనభైకియ్యి...." రాజీకి వచ్చాడు బాబూరావు.

"రెగ్యులర్ కస్టమర్ మిమ్మల్ని కాదనడంకన్నా నష్టాన్ని భరించడమే మంచిది. ఈ ఒక్క చీర చాలంటారా? ఇంకా ఏమైనా కావాలా?''

''ఇంకేమీ వద్దు అది ప్యాక్ చేయించు చాలు."

చకచకా ఆ చీరని ప్యాక్‌చేసి ఇచ్చాడు స్వామి. అందుకుని షాపులోంచి బయటపడ్డాడు బాబూరావు.

తన పుట్టినరోజుకి చీర తేలేదంటూ రెండ్రోజులనుండి కోల్డ్‌వార్ చేస్తోంది రాణి. ఈ పూట గనక దీన్ని తీసుకెళ్ళకపోతే కోల్డ్‌వార్ కాస్తా డైరెక్ట్‌వారుగా మారితీరుతుంది. అందుకే నెలాఖరు రోజుల్లో ఏదెంతచెబితే అంతకి తీసుకోక తప్పలేదు తనకి.

హఠాత్తుగా బాబూరావు మెదడులో ఓ మెరుపుమెరిసింది.

దీన్ని రెండొందలయాభైకి కొన్నట్లు రాణికి చెప్పాలి. ఎంత ఖరీదయిన చీరని తెస్తే ఆడవాళ్ళకి అంత ఆనందం!

*　　　*　　　*

"రమా! ఈ చీర ఎలావుంది?'' స్నేహితురాలిని అడిగింది రాణి.

''చాలా బావుందే! ఎంతకి కొన్నారు?''

"మూడొందలు...." చటుక్కున అనేసింది రాణి. తన పుట్టిన రోజుకి వాళ్ళాయన రెండొందల యాభై పెట్టి చీర కొన్నారని గర్వంగా చెప్పింది. ఇప్పుడు మూడొందలని చెప్పకపోతే తన అధిక్యత నిలిచేదెలా?

"మూడొందలా....?!

రమ మాటలోని ఆశ్చర్యానికి వేరే అర్థాన్ని తీసుకుని "నేను వద్దని పోరినా మా ఆయన వూరుకుంటేనా? బలవంతాన ఈ చీర తీసు కొచ్చారు.... పుట్టిన రోజుకి కొత్త చీర లేకుండా ఎలా? అంటూ" అనే సింది రాణి.

రమ మారుమాట్లాడలేకపోయింది.

అంచెలంచెలుగా ఆ చీరని తనకి తెలిసిన వాళ్ళందకీ చూపించి దాని ధర గురించి గొప్పగా చెప్పుకుంద రాణి.

విశాలికి కూడా ఆ చీర ఎంతో నచ్చింది. అందుకే మిత్రురాలి నడిగి ఒకసారి భర్తకి చూపించి అటువంటి చీరను కొనమని అడుగుతా నని రాణి చీరని పట్టుకెళ్ళింది.

ఆ రాత్రి ఇంట్లో బాంబుని పేల్చింది. ఇక చేసేదిలేక ఆ చీరని చూపించమన్నాడు ఆమె భర్త రాజారావు.

"నాకు అదే రంగుచీర కావాలి. లేకపోతే రాణి ముందు చులకనై పోతాను." గారాలు పోయింద విశాలి.

"అలాగే.... ఇలాంటి చీరే తెస్తాగా!" భార్యని శాంతపరిచాడు రాజారావు.

మర్నాడు ఆ చీరని పట్టుకుని స్నేహితుడు సదానందం దగ్గరకి పరుగెత్తాడు.

"మూడొందలు రూపాయలట! తక్షణం ఇలాంటి చీరొకటి ఇన్స్టా ల్మెంట్స్‌లో ఎక్కడయినా ఇప్పించు. లేకపోతే మూడొందలు ఇచ్చి పుణ్యం కట్టుకో.'' మిత్రుణ్ణి శరణు వేడాడు.

ఆ మిత్రుడు అభయమిచ్చి. రాజారావ్‌ని లక్ష్మీసిల్క్ హౌస్‌కి తీసుకెళ్ళాడు.

''చూడు స్వామీ! ఈయన రాజారావని నా క్లోజ్ ఫ్రెండ్. మా ఆఫీస్‌లోనే పనిచేస్తున్నాడు. ఇతనికి ఇలాంటి చీరే కావాలి. రెండు ఇన్‌స్టాల్మెంట్స్‌లో కట్టేస్తాడు.'' సదానందం మిత్రుణి పరిచయం చేశాడు లక్ష్మీసిల్క్ ప్రొప్రయిటర్‌కి.

"అలాగేనండి.... దీన్ని ఎంత కొన్నారండి?...." రాజారావుని అడిగాడు స్వామి.

"నేను కొనలేదు.... మా ఆవిడ స్నేహితురాలు...."

''అదేలెండి.... ఆవిడే! ఎంతకి కొన్నారు?"

"మూడొందలుట!"

"ఎందుకండీ? నేను రెండొందల డెబ్బయి అయిదుకే ఇస్తాను. మీరు మాత్రం ఇక ఎప్పుడు బట్టలు కావాలన్నా మా షాప్‌కే రండి...."

స్వామి మాటలకి మిత్రులిద్దరూ ఆనందపడిపోయారు.

"ఎప్పుడు బట్టలు కావాలన్నా నీ దగ్గరకే వస్తా''మని మొదట ఇన్‌స్టాల్మెంట్ నూటయాభై చెల్లించి బయటపడ్డారు.

సదానందానికి కృతజ్ఞతలు చెప్పుకుని రాజారావు ఇంటిదారిపట్టాడు.

సరిగ్గా అదే సమయంలో స్వామి తన అసిస్టెంట్‌లను కేకేసి ''ఈ రోజు కూడా రాత్రి కాసేపు కూర్చుని స్టాక్‌కి రేట్లేద్దాం" అన్నాడు.

''అదేంటి సార్! కొత్త స్టాకేమీ రాలేదుగా?'' అయోమయంగా అడిగాడు ఓ అసిస్టెంట్.

''ఉన్న స్టాక్‌కే డిమాండ్ పెరిగిందయ్యా.... ఇప్పుడున్న రేటు టాగ్‌లను మార్చి వేరే టాగ్‌లను తగిలించాలి." చిద్విలాసంగా నవ్వాడు స్వామి.

*

(కలువబాల పక్షపత్రిక, జనవరి 1-15, 1986)

# పరిధి

డిగ్రీ పూర్తికాకముందే ప్రసాద్‌కి రైల్వేలో ఉద్యోగం వచ్చింది. హౌరా వెళ్ళి జాయిన్ అయిపోయాడు.

డిగ్రీ ఫస్ట్ క్లాస్‌లో పాసై సంవత్సరం కావస్తున్నా నాకెటువంటి జాబూ దొరకలేదు. ఇంటర్‌వ్యూల పేరుతో ఇంకా ఊళ్ళు చుట్టూ తిరుగుతూనే వున్నాను.

"తల తాకట్టు పెట్టుకున్న తర్వాత అటు ఇటు తిరగడానికి ఎలానూ కుదరదు. కలకత్తాలో విక్టోరియా మెమోరియల్ జూబిలీ హాల్, బిర్లా ప్లానిటోరియమ్, కాళీగుడి, బేలూరు రామకృష్ణా మఠ్ మొదలయిన చూడదగ్గ ప్రదేశాలెన్నో వున్నాయి. ఓ పదిరోజులపాటు ఇక్కడికి వచ్చావంటే నాకూ కాస్త రిలీఫ్‌గా వుంటుంది. నీకూ ఛేంజ్ ఆఫ్ ప్లేస్‌గా వుంటుంది. తప్పకుండా రా" అంటూ ప్రసాద్ పదేపదే రాయడంతో బయల్దేరాను.

ముందే నేను ఏ బండిలో వస్తున్నానో టెలిగ్రామ్ ఇవ్వడంతో ప్రసాద్ బండి దగ్గరకు వచ్చాడు నన్ను రిసీవ్ చేసుకోవటానికి.

ట్రామ్‌లు, బస్సులు, టాక్సీలు మొదలయిన వాహనాలలో హడావిడిగా వున్న ఆ నగరాన్ని చూడగానే కొద్దిగా కంగారుగా అనిపించింది. ప్రసాద్ వెంట లేకపోతే ఈ నగరంలో తిరగగలనా అన్న అనుమానం వచ్చింది.

''ఇక్కడ నుంచి మనం మా రూమ్ వున్న ప్రదేశాన్ని చేరుకోవడానికి ట్రామ్‌లో వెళ్ళినా ముప్పావుగంట పడుతుంది.'' చిన్నగా నవ్వాడు ప్రసాద్.

''అంత దూరమే?!'' ఆశ్చర్యపోయాను.

"నేనింకా చాలా అదృష్టవంతుణ్ణి. లోకల్ ట్రయిన్‌లో రెండు గంటలకి పైగా ప్రయాణం చేస్తేగాని ఆఫీస్‌కి చేరని దూరంలో వున్నవాళ్లు కోకొల్లలు."

రోడ్లమీద, బస్సుల్లోనూ, ట్రామ్‌లలోనూ ఎక్కడ చూసినా మగవాళ్ళతోపాటు సమానంగా ఆడవాళ్ళు కనిపిస్తున్నారు. అందంగా అలంకరించుకుని సీతాకోక చిలకల్లా తిరుగుతున్న ఆ ఆడపిల్లల్ని చూస్తుంటే నాకు చాలా ఉత్సాహంగా అనిపిస్తోంది.

''ఇక్కడ ఆగుదాం. ట్రామ్ ఇక్కడ ఆగుతుంది. ఆ సూట్‌కేస్ నాకివ్వు.'' చేతిలోంచి బాగ్‌ని అందుకున్నాడు ప్రసాద్.

మాకు కొద్దిగా అవతల ఆధునాతనంగా అలకరించుకున్న నల్గురు అమ్మాయిలు నిలుచున్నారు. తెల్లటి వాళ్ళ శరీరఛాయ, ఎర్రటి పెదాలు నన్ను రెచ్చగొడుతున్నాయి.

ఇంతలో ఒక ట్రామ్ వచ్చి ఆగింది.

''ఇదికాదు మనం ఎక్కాల్సింది'' అన్నాడు ప్రసాద్. నాకు చాలా బాధగా అనిపించింది. ఆ నల్గురు అమ్మాయిలూ ఆ ట్రామ్ ఎక్కారు గబగబా అందర్నీ తోసుకుంటూ ట్రామ్‌లోపలికి దూసుకుపోతున్న వాళ్ళని చూడగానే బాధనిపించింది. మేమూ ఆ ట్రామ్ ఎక్కేవాళ్ళమయితే ఇంచక్కా వాళ్ళని వరుసుకుంటూ నిలుచునే అవకాశం దక్కేది కదా!

ట్రామ్ వెళ్ళిపోయింది.

''కలకత్తాలో బ్రతకాలంటే ముందు ఆగీ ఆగక ముందే బయల్దేరే ట్రామ్‌లలో ఎక్కడం, దిగడం నేర్చుకోవాలి.'' వెళ్తున్న ట్రామ్‌వంకే చూస్తూ అన్నాడు ప్రసాద్.

''అలా మనిషిమీద మనిషి నిలబడి పోకపోతే తర్వాతి ట్రామ్ వచ్చేదాకా ఆగవచ్చుగా?" అన్నాను.

"ఎంత సేపాగినా అంతే! మరో అయిదు నిముషాలాగి చూడు—ఇంకెంతమంది పోగవుతారో ఇక్కడ!" చిన్నగా నవ్వాడు ప్రసాద్.

"అయినా కానీ ఆడపిల్లలలా మగవాళ్ళని తోసుకుంటూ ఎక్కడం నాకేమీ బాగోలేదు...."

''అదిగో, మన ట్రామ్ వస్తోంది. ఆగీ ఆగకముందే ఎక్కు. మళ్ళీ వెంటనే బయల్దేరుతుంది." హెచ్చరించాడు ప్రసాద్.

ట్రామ్ ఆగీ ఆగకముందే అక్కడున్న జనమంతా ట్రామ్ మీదకి ఎగబడ్డారు. ప్రసాద్ పుణ్యమాని మొత్తానికి ఎక్కగలిగాను.

స్పీడందుకుంది ట్రామ్.

నడుస్తున్న నరకం.

మనిషిమీద మనిషి.

నాకు ఇవతల ఓ యువతి వుండడంతో అంతటి ఇరుకూ నాకు ఇబ్బందిని కలిగించడంలేదు.

ఇలా రోజూ ఈ ఆడపిల్లలు తిరగాల్సిందేనా?

సరిగ్గా మేము దిగాల్సిన స్టాపులోనే ఆ యువతీ దిగింది. దిగీదిగక ముందే చకచకా ముందుకువెళ్ళిపోయింది. ఇంత సేపు అంతమంది పరాయి వాళ్ళ మధ్య అనుభవించిన 'ఇరుకు' ఆ మొహంలో కొంచెం కూడా కనిపించడంలేదు నాకు.

ఇంటికి చేరుకున్న తర్వాత కూడా ఈ ఆలోచనలు నన్ను విడిచి పెట్టలేదు. అక్కడి ఆడవాళ్ళు ఎందుకు సిగ్గుని ఇంత పూర్తిగా విడిచి పెట్టేశారు? నాగరికత అంటే ఇదేనా?

ఇవే ప్రశ్నలు ప్రసాద్‌ని అడిగాను.

వాడు చిన్నగానవ్వి "ఈ ప్రశ్నలకు జవాబు రేపు ఉదయం చెప్తా" నన్నాడు.

బాగా బడలికగా ఉండడంతో నేను భోంచేసి పడుకున్నాను. వాడు ఆఫీస్‌కి వెళ్ళిపోయాడు.

సాయంత్రం సినిమాకి వెళ్ళి వచ్చాం.

ఆ రాత్రంతా కబుర్లతో నిద్రలేకుండా గడిపేశాం.

మర్నాడు ఆదివారం -

అయినా పొద్దున్నే లేచాం.

స్నానాదులు పూర్తిచేసుకుని బయటికి బయల్దేరాం.

సరాసరి ఓ పెద్ద పార్క్‌కి తీసుకెళ్ళాడు

"ఇది రవీంద్రసరాని...." అన్నాడు.

మధ్యలో సరస్సులాగా వుంది. చుట్టూ పార్కు.

ఆ పార్కునే ఆశ్రయంగా చేసుకుని జీవిస్తున్నవాళ్ళు ఎంతోమంది కనిపించారు. వాళ్ళందరూ ఆ మధ్యలో వున్న సరస్సులో స్నానంచేసి, బట్టలుతుక్కుంటున్నారు.

వాళ్ళలో అధికబాగం కట్టుకోడానికి మరో బట్ట కూడా లేని అభాగ్యులే!

వాళ్ళను చూస్తుంటే కడుపు తరుక్కుపోతోంది.

"మన దేశం ప్రగతిపథంలో పయనిస్తోంది" అన్న వాళ్ళందర్నీ అక్కడికి లాక్కొచ్చి వాళ్ళని చూపించాలనిపిస్తోంది.

అప్పుడే స్నానం చేసి, సగం చీర శరీరానికి చుట్టబెట్టుకుని మిగతా సగం చీరని అరబెట్టుకుంటున్న ఆ ఆడబడుచుల్ని చూడగానే హృదయం ద్రవించిపోయింది.

అలా వాళ్ళని చూస్తూ నిలుచుండిపోయాను.

"ఏమిటిరోయ్! వాళ్ళ అర్ధనగ్న శరీరాలను చూసి ఆనందిస్తున్నావా?" ప్రసాద్ మాటలు శూలాల్లా నా మనసుని తాకాయి.

వాళ్ళలాంటి దీనపరిస్థితిలో వుంటే వాళ్ళలో సెక్స్‌ని చూస్తున్న వాడి హీనసంస్కారానికి వాణ్ణి ఏమి చేసినా పాపం లేదనిపించింది.

''కట్టుకోడానికి మరో చీర కూడా లేకుండా కట్టుకున్న చీరనే అలా వంటిమీదే ఉతుక్కుని రెండోపక్క అరబెట్టుకుంటూ, అటు ఆరిన తర్వాత ఆ వైపు కట్టుకుని మొదటివైపు ఆరబెట్టుకుంటున్నవాళ్ళని చూస్తుంటే జాలి కలగకపోతే పోయింది- అంత నీచంగా ఎలా మాట్లాడగల్గుతున్నావ్‌రా?'' ఆశ్చర్యంగా అడిగాను, వాడి కుసంస్కారానికి జాలి పడుతూ.

చిన్నగా నవ్వాడు ప్రసాద్.

"ఎందుకురా నవ్వుతావ్?" నాలో కోపం పెరిగింది. సిగ్గుపడాల్సింది పోయి నవ్వుతాడేం?

"ఇదే నిన్న నువ్వు అడిగిన ప్రశ్నకి జవాబు'' అన్నాడు.

వాడి మాటలు నాకర్థం కాలేదు.

''నిన్న నేనడిగిన ప్రశ్న ఏమిటి?''

"ట్రామ్‌లలో మగవాళ్ళ మధ్య సిగ్గు శరం లేకుండా తిరుగుతున్నారు ఇక్కడి ఆడవాళ్ళు అన్నావుగా?'

"అవును."

"ఇక్కడ వీళ్ళు అర్ధనగ్న ప్రదర్శనకోసం స్నానాలు చేస్తున్నారా? అలాగే వాళ్ళు విధిలేక మగవాళ్ళ మధ్య అలా అడ్జెస్ట్ అయి తిరుగుతున్నారు. ఇంట్లో ఇద్దరూ పనిచేస్తేనే మధ్యతరగతి కుటుంబాలు గడిచేది. ఆ వచ్చిన కాస్తా టాక్సీలలో తిరిగి ట్రాన్స్‌పోర్ట్‌కోసం తగలెయ్యలేరుకదా? నీ ఆలోచనా పరిధిని కాస్త పెంచి ఆలోచించు" అన్నాడు ప్రసాద్.

కుసంస్కారి ఎవరు? అతనా- నేనా? చెంపమీద ఛెళ్ళున చరిచినట్లయింది.

*

(కలువబాల - పక్షపత్రిక, ఏప్రిల్ 16-30, 1986).

మొదట్లో ఎవరో ఒకళ్ళకి నచ్చకపోతానా అనే ధైర్యముండేది కల్పనకి. రాన్రాను అది తగ్గిపోతూ- ఇరవై ఎనిమిదో సంబంధం వచ్చే సరికి పూర్తిగా మృగ్యమైపోయింది.

తనకోసం కాకపోయినా తల్లిదండ్రుల బాధ చూసయినా కాసేపు పెళ్ళిచూపుల నరకాన్ని భరించక తప్పదు.

అయిష్టంగానే మొహం కడుక్కుని చీర మార్చుకుని పెళ్ళి చూపులకు తయారు కాసాగింది కల్పన.

ఎలాగూ వీళ్ళు నచ్చలేదంటారు. కాబట్టి, ముందు తనకే అతను నచ్చలేదంటే పోలా....?!

ఆమెలో వింత ఆలోచనాధోరణి ప్రారంభమైంది. రాబోయే పెళ్ళికొడుకులో లోపాల్ని ఎలా ఎంచవచ్చు అని ఆలోచించసాగింది.

పెళ్ళివారు వచ్చారు.

ఇంట్లో హడావుడి పెరిగిపోయింది....

అందరిలోనూ కంగారు....

మామూలు ప్రకారం కాఫీ టిఫెన్లు పూర్తికాగానే అమ్మాయిని తీసుకు రమ్మన్నారు. తల్లి వెంటరాగా నెమ్మదిగా హాల్లోకివెళ్ళి తనకోసం వేసివుంచిన చాపమీద కూర్చుంది కల్పన.

అందరి చూపులూ తనమీదే వుంటాయి. తన అందవికారానికి నవ్వుకుంటారేమో! సిగ్గు, భయంతో ఆమె తల నేలకి కూరుకుపోసాగింది.

"నీ పేరేమిటి?" పెళ్ళికొడుకు అక్కగారు అడిగింది

"నా పేరుకూడా కనుక్కోకుండానే పెళ్ళి చూపులకి వచ్చారా?'' కల్పనకి కోపం వచ్చింది. అదబడుచు అర్ధ మొగుడు. తమాయించుకుని ''కల్పన'' అని నెమ్మదిగా జవాబిచ్చింది.

''ఏ బాంక్‌లో పని చేస్తున్నావ్?'' పెళ్ళికొడుకు ప్రశ్న.

"పరాయి ఆడపిల్లని ఏకవచనంతో సంబోధించి మాట్లాడడానికి సిగ్గు లేదూ?" ఎదురు ప్రశ్న వెయ్యాలన్నంత కోపం వచ్చింది కల్పనకి.

సహనం స్త్రీకి ముఖ్యగుణం. తనెక్కడ పనిచేస్తున్నదీ అణకువగానే జవాబిచ్చింది.

పెళ్ళికొడుకు తల్లి, తండ్రి మరికొన్ని పెళ్ళిచూపుల రొటీన్ ప్రశ్నలని వేశారు. వాటికీ ఓపిగ్గా జవాబిచ్చింది.

"ఇక అమ్మాయిని లోపలికి తీసుకువెళ్ళండి." అర్థించాడు పెళ్ళికొడుకు తండ్రి.

తల్లి వచ్చింది. కల్పనని లోపలికి తీసుకువెళ్ళడానికి.

లోపలికి పోబోతూ అలవోకగా పెళ్ళికొడుకువంక చూసింది కల్పన.

అందగాడే!

కల్పన మనసు వెంటనే ఎదురు తిరిగింది. మనిషి ఎర్రగా వుంటే సరిపోతుందా? మొహంలో కళ వుండొద్దూ....?

నల్లగావున్న తన ముఖంలో కళ వుంది....ఆతన్లో ఆ కళ ఏదీ?

ఇప్పుడామెకి అతన్లో అందం వున్నట్లు ఏకోశానా అనిపించడం లేదు. తనకి అతను భర్తగా ఎంతమాత్రం తగడు....!

తన ఆలోచనా ధోరణి తనకే నవ్వు తెప్పించింది కల్పనకి. అయినా తప్పదు. రేపు వాళ్ళనుంచి వచ్చే జవాబుని తట్టుకోవాలంటే ఇలా ఆలోచించక తప్పదు.

"అబ్బాయి ఎలా వున్నాడమ్మా?" పెళ్ళివారిని రోడ్డుమీదదాకా సాగనంపి లోపలికి వచ్చిన తండ్రి ఆప్యాయంగా అడిగాడు కల్పనని.

"నాకు నచ్చలేదు నాన్నా!...." ఆమాటనేసి అక్కణ్ణుంచి చకచకా అవతలికి వెళ్ళిపోయింది కల్పన.

కూతురు ప్రవర్తనకి విస్తుబోయి చూస్తూ నిలబడిపోయారు తల్లి తండ్రి.

*   *   *

"ఇన్నాళ్టికి మనకి మంచి రోజులు వచ్చాయమ్మా!" ఆనందంగా ఇంటికి వచ్చిన తండ్రిని చూడగానే కల్పనకి ఆనందం కలిగింది.

ఎన్నాళ్టికి తండ్రి ముఖంలో ఆనందాన్ని చూస్తోంది తను!

"ఏమైందండీ....మొన్న చూసి వెళ్ళిన వాళ్ళు ఏమైనా చెప్పారా?" ఆత్రంగా అడిగింది అప్పుడే వంటింట్లోంచి వచ్చిన తల్లి.

"మన అమ్మాయి చాలా అదృష్టవంతురాలు....పిల్ల నచ్చిందన్నారు. త్వరలోనే ముహూర్తాలు కూడా పెట్టించమన్నారు...."

ఆనందంతో షాక్ తగిలినట్లయింది కల్పనకి. తను వింటున్నది నిజమేనా? తను అతనికి నచ్చిందా? తనని పెళ్ళి చేసుకోడానికి సమ్మతిని తెలియజేశారు నమ్మశక్యం కాకుండాపోతోంది ఆమెకి.

రోజులు ఎవరికోసమూ ఆగవు. మంచయినా, చెడయినా పరుగెత్తుతూనే వుంటాయి.

కల్పన పెళ్ళి జరిగిపోయింది.

అంత అందగాడు తన భర్త! తలచుకొంటున్నకొద్దీ ఆమెలో తృప్తి పెరిగిపోయి గర్వంగా మారసాగింది.

అంత ఆనందంలోనూ ఆమెకి అర్థంకాని ప్రశ్న ఒక్కటే - ఇంతమందికి నచ్చని తను అతనికెలా నచ్చింది?

ఈ ప్రశ్నకి జవాబు చెప్పగలవాడు అతనే!

అందరూ మధురంగా వూహించుకునే మొదటి రాత్రి....

ఇద్దరూ ఈ లోకంలోకి వచ్చారు.

"ఏమండీ....!" అతని గుండెల్లో తలదాచుకునే పిలిచిందామె.

"ఊఁ...."

"మీకు నేనంతగా నచ్చానా?" నెమ్మదిగా అడిగింది.

"నచ్చకపోతే ఎందుకు చేసుకుంటాను?...." చిన్నగా నవ్వాడతను.

తృప్తిగా గాలి పీల్చుకుంది కల్పన.

"మనిషికి అందంకాదు ముఖ్యం. మంచి మనసు.... అది నీకున్నది."

గర్వంతో పొంగిపోయింది కల్పన.

"నాది టూర్ల ఉద్యోగం. నెలలో ఇంట్లో వుండేకన్నా బయట తిరిగే రోజులే ఎక్కువ. అందమైన భార్య అయితే లేనిపోని అనుమానాలు. అదీ కాకుండా చుట్టుపక్కలవాళ్ళ అందరికళ్ళూ ఆమెమీదే వుంటాయి."

కల్పన నెత్తిన పిడుగులు పడ్డట్లయింది. అతను ఇంకా ఏమేమో చెప్పుకుంటూనే పోతున్నాడు. కానీ ఆమెకేమీ వినిపించడం లేదు. ఆ అందమైన పురుషుడి ఆదర్శం వెనుకనున్న రాక్షసత్వం ఆమెను నిలువునా కాల్చేస్తున్నట్లు ఫీలై, భయంతో జుగుప్సతో కళ్ళుతిరిగి వెనక్కి వాలిపోయింది కల్పన. *

(తెలుగుబాల - పక్షపత్రిక, జూలై 1-15, 1985)

